# శ్రీ మధురాంతకం రాజారాం కథలు

ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి

ఎం. ఫిల్. పట్టాకోసం సమర్పించిన

సిద్ధాంతవ్యాసం

1985

ఎస్. రాజవర్ధన్, *ఎం.ఎ; ఎం.ఫిల్.*

ప్రచురణః

తెలుగు విశ్వవిద్యాలయము వారి ఆర్థిక సహాయముతో...

ప్రథమ ముద్రణ 1988
ప్రతులు 500

ప్రతులకు :

ఎస్. రాజవర్ధన్
S/o శ్రీ ఎస్ సదాశివ, రిటైర్డ్ ప్రిన్సిపాల్
విద్యానగర్ కాలనీ,
ఆదిలాబాదు-504 002

వెల రూ॥

ముద్రణ :

శారద ప్రింటర్స్ అండ్ బైండర్స్
శాస్త్రిరోడ్, కరీంనగర్-505 001

# : నివేదిక :

శ్రీ మధురాంతకం రాజారాం గారి కథలపై నాకు గల ప్రత్యేకాభిమానం వన్నీ పరిశీలనకు పురికొల్పింది మా నాన్న శ్రీ ఎస్. సదాశివగారి ఆదేశం, ఆశీస్సుల వల్ల ఈ వ్యాసంగం చేపట్టాను. ఆనాటి తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య బిరుదురాజు రామరాజుగారు, డీన్‌గా వున్న ప్రొఫెసర్ డా రఫియాసుల్తానాగారు ఉస్మానియా విశ్వ విద్యాలయం తరపున నాకీ అవకాశాన్ని కల్పించారు.

రాజారాంగారు దాదాపు మూడువందల కథలు రాశారట! వాటిలో ఒక వందదాకా వారిదగ్గర కూడాలేవు. రేడియో తదితర ప్రచార సాధనాలకోసం రాసిన కథలే వాటిల్లో ఎక్కువ. మిగిలిన రెండువందల కథలను నేను పరిశీలనకు ఎన్ను కున్నాను. కేవలం లైబ్రరీల పైననే ఆధారపడితే ఈ కథలన్నీ లభించేవే కాదో! చిత్తూరు జిల్లాలోని దామలచెరువుకు వెళ్లి రాజారాంగారిని అర్థించగానే ఎంతో నమ్మ కంతో తమదగ్గరున్న కథలన్నీ ఇచ్చి ఆశీర్వదించారు. మూడురోజులు ఇంట్లో వుంచు కొని ఎన్నో విషయాలు మాట్లాడి రాజారాం దంపతులు చూపిన పుత్రవాత్సల్యం మరుపురానిది.

విషయసేకరణ కోసం వెళ్లినప్పుడు శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ లైబ్రరీ లోని అసిస్టెంట్ లైబ్రరియన్ శ్రీ షణ్ముగంగారు పరిశోధక విద్యార్థి శ్రీ సుధాకరబాబు గారు ఎంతో తోడ్పడ్డారు.

తెలుగు కథానికలపైన మార్గదర్శకమైన కృషిచేసిన డా. పోరంకి దక్షిణా మూర్తిగారు ఎన్నో సందేహాలను తీర్చారు. వారి అముద్రిత పరిశోధన గ్రంథం నాకెం తో తోడ్పడింది.

వివిధ సలహాలనిస్తూ సందేహాలను తీర్చినవారు డా. సాందీప్‌గారు మరియు మిత్రులు యామిజాల ఆనంద్‌గారు.

ప్రముఖ జర్నలిస్టు మా నాన్నగారి ఆప్తమిత్రులు, సర్వజన మిత్రులు అయిన జి. కృష్ణగారు ఎన్నో సందేహాలను తీర్చారు.

ఎగ్జామినర్‌గా విచ్చేసి ఆత్మీయంగా పరీక్షను ముగించిన డా. సి. ఆనంద రామంగారు ...

విషయసేకరణలో సహకరించిన ఉస్మానియా యూనివర్శిటీ లైబ్రెరీ స్టేట్ సెంట్రల్ లైబ్రెరీ అఫ్జల్ గంజ్, సిటీ సెంట్రల్ లైబ్రెరీ అశోకనగర్, శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ లైబ్రెరీల అధికారులు...

గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అందజేసి ప్రోత్సహించిన తెలుగు విశ్వవిద్యాలయాధికారులు...

ఈ గ్రంథ ప్రచురణకొరకు అనుమతినిచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య ఎం కులశేఖరరావుగారు...

అధికార బాధ్యతనుమీరిన శ్రద్ధాసక్తులతో పర్యవేక్షించిన డా. ఎన్. గోపాల్ గారు అన్నివిధాల ఆదరించిన అరుణక్కయ్యగారు...

సకాలంలో ముద్రించి ఇచ్చిన శారద ప్రింటర్స్ అధిపతి శ్రీ నాగభూషణం గారు మరియు వారి సిబ్బంది శ్రీ భూమేశ్వర్, శ్రీ సత్యనారాయణగారు తదితరులు...

అందరికీ హృదయపూర్వక కృతజ్ఞతలు.



భారతదేశం కథలకు కాణాచి. భారత సంస్కృతిలోనే కథ ఒక భాగంగా ఇమిడివుంది. ఆదిమానవుడు సంకేతాలను, సంజ్ఞలను విడిచి భాష నేర్చుకున్న తర్వాత కథ పుట్టింది. మానవుడు తన అనుభవాలను ఇతరులకు వివరించి చెప్పాలనే కుతూహలంతో వాస్తవానికి కల్పనను కొంత, ఆత్మ ప్రశంసను కొంత జోడించి చెప్పడం మొదలైంది. అందంగా చెప్పడంలో నిపుణుడైన వ్యక్తిని మిగతా వ్యక్తులంతా ఆసక్తిగా వినడం పరిపాటి అయింది. వ్యక్తిగత అనుభవాలే కాకుండ ఒక ప్రధానవ్యక్తికి కొన్ని అమానుష శక్తులు జోడించి అతన్ని కథానాయకుడిగా చేసి కథ చెప్పడం అనే ప్రక్రియ వ్యాప్తిలోకి వచ్చింది.

'కథ' ధాతువుకు 'చెప్పుట' అని అర్థం. దీని నుండి వచ్చిన కథాది శబ్దాలు చెప్పడాన్ని బోధిస్తాయి.

వృద్ధులు తమ అనుభవాలను పిల్లలకు తెలియజెప్పడం అనేది పిల్లల పాలిట మనోరంజక కార్యక్రమంగా నేటికీ నిలిచివున్న సంప్రదాయం.

లిపి పుట్టిన తరువాత కథలు రాయడం ప్రారంభమయింది. ప్రపంచ సాహిత్యంలో అతి ప్రాచీనంగా చెప్పుకునే ఋగ్వేదంలోని శునశ్శేపుని కథ మొదలైనవి ఒకరకంగా కథాబీజాలని చెప్పవచ్చు. ఐతరేయ బ్రాహ్మణం, శతపత బ్రాహ్మణం, ఉపనిషత్తులు మొదలైన వాటిల్లో ఎన్నో కథాబీజాలు దొరుకుతాయి. ఇక పురాణాలు కథా సాగరాలే !

మారుతున్న కాలానికి అనుగుణంగా ప్రజలను ధర్మబద్ధుల్ని చెయ్యడానికి నీతికథలు ప్రారంభమయ్యాయి. వీటిలో అద్భుతాలతో కూడిన మహాత్ముల జీవిత చరిత్రలు చెప్పుకోతగినవి. మత ప్రచారానికి కథ చాలా అనువుగా వుంటుందనే ఉద్దేశ్యంతో బౌద్ధ జాతక కథలు – జైనగాథలు మొదలైనవి ప్రారంభమయ్యాయి.

కథా సాహిత్యానికి ఆదిగ్రంథమనబడే "బృహత్కథ" ఆంధ్ర శాతవాహనుల కాలంనాటిదని చారిత్రకుల అభిప్రాయం. దీనిని గుణాఢ్యుడు క్రీ.పూ. 200-150 ల మధ్య పైశాచీ ప్రాకృతంలో రాశాడు. దీని ఆధారంగా తెలుగువారికి శాతవాహనుల కాలంనాటికే కథావాఙ్మయం వర్ధిల్లినట్లు తెలుస్తున్నది.

అయితే శాతవాహనుల నుండి క్రీ. శ. 11వ శతాబ్దం వరకు తెలుగు సాహిత్యంలో జరిగిన వికాసం గురించిన స్పష్టమైన ఆధారాలు లభించడం లేదు. కాని

ఆ కాలంలో కథా కథనమే జీవన వ్యాసంగంగా గల ఒగ్గువాళ్లు, పిచ్చకుంట్లు, బీర న్నలవాళ్లు మొదలైన జాతులవలన బాలనాగమ్మ కథ, దేసింగురాజు కథ, కాంబోజి రాజు కథ, లక్ష్మమ్మ కథ మొదలైన కథలు సజీవంగా ప్రజల నాలుకలపై నిలిచి పోయాయి.

క్రి.శ. 11వ శతాబ్దినుండి అనగా ఆదికవి నన్నయ కాలము నుండి తెలుగు సాహిత్యం అనేక పోకడలు పోయింది. నన్నయగారి కథాకథన శిల్పం ఈ కాలము లోనే మెరుగులు దిద్దుకున్నది. నన్నయ సమకాలికులు, తరువాతివారు కథను తమ కావ్యాలలో వస్తువుగా స్వీకరించినా వాటిలోని కావ్య ప్రాబంధిక లక్షణాలవలన కథకు ప్రాధాన్యం తగ్గుతూ వచ్చింది.

## 1. కథానికా లక్షణాలు :

మన ప్రాచీనులు కథను ఒక సాహిత్య ప్రక్రియగా గుర్తించడమే కాదు. దానికి లక్షణాలనుకూడా చెప్పారు. ఈ విధంగా ప్రపంచ సాహిత్యంలోనే ప్రథమం గా కథకు లక్షణ నిర్దేశం చేసిన ప్రతిష్ఠ అగ్నిపురాణానికి దక్కుతుందని విజ్ఞుల అభి ప్రాయం.[1]

ఆఖ్యాయికా, కథ, ఖండకథ, పరికథ, కథానిక అని ఐదింటిని గద్య కావ్యాలుగా నిర్వచించారు. కథావస్తువునుబట్టి దివ్యకథ, దివ్యమానుషకథ అనే విభాగంకూడా కనిపిస్తుంది.

కథావిస్తృతి లేదా పరిధినిబట్టి ఆఖ్యాయిక అన్నింటిలో పెద్దదని కథానిక చిన్నదని తెలుస్తున్నది. కథానికను గూర్చి "కథానిక" అనే వ్యాసంలో ...

" భారతీయ సాహిత్యశాస్త్రంలో కథానిక అన్నపేరు సిద్ధమైవున్నది " అని ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు పేర్కొన్నారు.[2]

---

1. "ఆఖ్యాయికాకథా, ఖండకథా, పరికథా తథా కథానికేతి మన్యంతే గద్య కావ్యంచ పంచధా."

2. 'కనికథా' వ్యాసం, 'ప్రతిభ' ఆగష్టు 1936 ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి.

పూర్వం కథా, కథానకము, ఆఖ్యానము, ఆఖ్యాయిక అనే వ్యవహారాలు ఉండనే ఉన్నాయి.

"ఏకాంశవ్యగ్రమై స్వయం సమగ్రమైన కథాత్మక వచనరచనా ప్రక్రియను కథానిక" అని డా॥ పోరంకి దక్షిణామూర్తిగారు నిర్వచించారు 3

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు 'కథానిక' నామాన్ని స్థిరీకరించి దానికి మౌలికత, ఏకత, క్లుప్తత, శైలీరమ్యత, క్రియాశీలత, రూపం, వస్తువు అని ఏడు లక్షణాలు ఉండాలన్నారు.

పాశ్చాత్య సాహిత్యంలో కథానికా లక్షణాలను నిర్దేశం చెయ్యడానికి ఎడ్గార్ ఎలెన్ పో ప్రయత్నించాడు.

" 1. It must be short i.e. Capable of being read at one sitting.

2. It should aim at a single or unique effect.

3. It should be compressed

4. It must assume the aspect of versi multitude.

5. It must give the impression of finalty. " 4

ఏకబిగిని చదివించేంత క్లుప్తతను పాటించడం ఆ క్లుప్తతను సాధించడానికి పలువిషయాలు కాకుండా ఒక ప్రత్యేకంశాన్ని లక్ష్యంగా పెట్టుకోవడం.

ఆ ఏకాంశంలోనే అనేక విషయాలను ఇముడ్చడం, ముగింపు సహజ రమ్యంగావుండి కథ నిజంగా మునిగిన అనుభూతి పాఠకునికి కలుగడం అనేవి కథానికా లక్షణాలుగా ప్రతిపాదించాడు ఎడ్గార్ ఎలెన్ పో. ఈ లక్షణాల పరస్పర సంబంధాన్ని గమనించవచ్చు.

---

3. "తెలుగు కథానిక స్వరూప స్వభావాలు" పి. హెచ్‌డి. సిద్ధాంతవ్యాసం. డా॥ పోరంకి దక్షిణామూర్తి.

4. "Twice told stories" Adgar Allen Poe.

## 2. తొలి కథానిక :

ఆధునిక లక్షణాలతో వెలువడిన తొలితెలుగు కథానిక "దిద్దుబాటు"

దీనిని ఎడున్నర దశాబ్దాల క్రితం (1910 ఫిబ్రవరి) మహాకవి గురజాడ అప్పారావుగారు 'ఆంధ్రభారతి' లో ప్రకటించారు. ఈ కథను అప్పారావుగారు మొదట గ్రాంధికంలో రాసినా దృక్పథపరిణామక్రమంలో దానిని వ్యవహారికంలోనికి తిరగరాసి 'కమలిని' అని పేరు పెట్టారు.

ఈ శతాబ్ది ప్రారంభంలో తెలుగు పత్రికలు కథానికను బాగా ప్రోత్సహించాయి. అందువల్ల కథానికా వికాసం సాధ్యపడింది.

ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, సాహితి, వినోదిని మొదలైన పత్రికలు కథలను విరివిగా ప్రచురించేవి. 1924 లొ ప్రారంభించబడిన 'భారతి' మాస పత్రిక ఎందరో రచయితలను మంచి కథకులుగా తీర్చిదిద్దింది.

నూరీ, పీతీ, వెంకీ, వటీరావు వంటి మంచి పాత్రలను సృష్టించిన చింతా దీక్షితులు; భార్యాభర్తల ప్రణయ కలహాలను సరసంగా చిత్రించిన నోరి నరసింహ శాస్త్రి; కాంతం పాత్రను సృష్టించి ఆ పాత్రను సజీవంగా పాఠకుల మనస్సుల్లో నిలిపిన మునిమాణిక్యం నరసింహారావు; స్వతహాగా చిత్రకారుడు కావడంవలన కథల బొమ్మలు కట్టిన అడవి బాపిరాజు; పల్లెలలోని బ్రాహ్మణ కుటుంబాలను, వితంతువుల వ్యథలను సంస్కార దృష్టితో పరిశీలించి స్పందించిన శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి; విద్వాంసులు కథకులు కాలేదన్న లోటును తీర్చిన వేలూరి శివరామశాస్త్రి; ప్రవాసంలొ ఉంటూ మాతృభూమి మీద అభిమానంతో కృష్ణాతీర అగ్రహారాలను, దివిసీమ రమణీయతను తమ కథలొ పొందుపరచిన మల్లాది రామకృష్ణశాస్త్రి; స్త్రీ సమస్యలను ధైర్యంగా చెప్పిన గుడిపాటి వెంకటచలం; చైతన్య స్రవంతిలొ కథలు రాసిన బుచ్చిబాబు; కథానికకు తాత్త్వికదృక్కోణం ప్రసాదించిన గోపీచంద్; మధ్యతరగతి జీవితాల్లొ వైరుధ్యాలను బహిర్గతం చేసిన కొనవటిగంటి కుటుంబరావు; రాయలసీమ బడుగు జీవితాల కడగండ్లను కళ్ళకు కట్టినట్లు చిత్రించిన కే. సభాకరుకుమార; తెలుగు కథానికల్లొ "గాలివాన" సృష్టించిన పాలగుమ్మి పద్మరాజు; ఆరుసారా కథల రా. వి. శాస్త్రి. పీడితజన పక్షపాతి కాళీపట్నం రామారావు. మార్క్స్ దృక్పథం అలవడ్డా మహాభారతాగ్ని పొగిడే చాగంటి సోమయాజులు;

మధ్యతరగతి కథల ప్రతినిధిగా పేరుపొందిన మధురాంతకం రాజారాం మొదలయిన ఎందరో కథారచయితలు తెలుగు కథా సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు.

మధురాంతకం రాజారాంగారు మధ్యతరగతి కథలు రాస్తారని విమర్శకులంటారు. మధ్యతరగతిలోని కుటుంబ జీవితం రాజారాంగారి కథల్లో కనిపించే మాట నిజం. ఉపాధ్యాయులు ఎదుర్కొనే సమస్యలు, అనుబంధాలు, ఆత్మీయతలు, సాంప్రదాయక విలువలు, గ్రామీణ వాతావరణం మొదలయినవి ప్రధానంగా రాజారాంగారి కథలో కనిపిస్తాయి. రాజారాంగారి కథలన్ని ఈ ఇతివృత్తాల చుట్టే తిరుగుతుంటాయి. కనుక ఆయన కథలు ప్రత్యేకంగా ఆధునిక కథకులలో ఒక ప్రత్యేకమయిన స్థానాన్ని పొందాయి.

ఈ విధంగా ప్రతిభావంతులయిన కథకుల కథా సాహిత్యం ప్రజా బాహుళ్యాన్ని చేరగలిగింది. ఈనాడు కనీసం ఒక్క కథయినా లేకుండా తెలుగు పత్రికలు వెలువడకపోవడమే దీనికి తార్కాణం.



# II

# రాజారాం కథానికలు
# వర్గీకరణ

ఒక రచయిత సుదీర్ఘ కాల బృహత్ రచనా వ్యాసాంగాన్ని పరిశీలనకు స్వీకరించినప్పుడు దానిని నిర్దుష్టంగా, సులభతరంగా నిర్వహించడానికి కొన్ని భాగాలుగానో వర్గాలుగానో విభజించుకోక తప్పదు. ఆ విభజన ఆయా విభయాల మధ్యన ఉండే సామ్యభేదాలనుబట్టి యేర్పడుతుంది. అయితే వేటి ఆధారంగా ఈ వర్గీకరణ వీలవుతుంది అనేది పరిశీలనకు ఎన్నుకున్న సాహిత్యప్రక్రియ నిర్ణయిస్తుంది.

కథానికకు సంబంధించినంతవరకు కథావస్తువు, కథాప్రయోజనం, కథన విశేషం తదితర అంశాలనుబట్టి వర్గీకరించవచ్చు.

మధురాంతకం రాజారాంగారి కథలను పై ఆధార సూత్రాలతో మరీ తెగ్గొట్టినట్లు కాకుండా కొంతవరకు వర్గీకరించవచ్చు. ఇవేగాక ఈ విభజనలో రచయిత వ్యక్తిత్వంలో కొట్టొచ్చినట్లు కనబడే అంశాలు, ఆయా కథల్లో ప్రకాశమానమయ్యే పలు ప్రత్యేకతలనుకూడా దృష్టిలో పెట్టుకోవడం జరిగింది.

కథల వర్గీకరణవల్ల ఒనగూడే ప్రయోజనం తక్కువదేమీ కాదు. అపారంగా సిద్ధించిన సాహిత్యరాశిని ఒకచోట క్రోడీకరించి చెప్పుకోవడానికి, కొండను అద్దంలోలాగా దర్శించడానికి వీలవుతుంది.

తెలుగు కథానిక పుట్టిన (1910) ఇరవై ఏళ్లకు మధురాంతకం రాజారాం గారు పుట్టారు (5వ అక్టోబర్ 1930). ఆయన పుట్టిన ఇరవై యేళ్లకు కథారచన చేపట్టారు (1951). ఆనాటినుండి ఈనాటివరకు అంటే దాదాపు 35 ఏళ్ళనుండి అవిశ్రాంతంగా కథారచన చేస్తున్నారు. తొలి కథానిక "వీరోచిత వర్తకం" ఆంధ్ర

పత్రిక (30 మే 1951) లో అచ్చయింది. మరో పదేళ్ళకు తొలి కథా సంపుటాన్ని ప్రచురించారు (1961). ఒకవైపు కథారచన చేస్తూనే మరోవైపు నవలలు, గేయాలు, నాటికలు, వ్యాసాలు రాస్తూవచ్చారు. కాని రాజారాంగారికి కథారచయితగానే పేరువచ్చింది. తొలి కథానికనుండి ఈనాటివరకు (1951 నుండి 1985) దాదాపు మూడొందల కథలు వివిధ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. నూరు కథలు కలిపి పన్నెండు సంపుటాలుగా వచ్చాయి. మరొక సంపుటం అచ్చులో వుంది. కాలక్రమంలో కథాసంపుటాలు ఈ క్రింది విధంగా వున్నాయి.

| క్రమ సంఖ్య | కథాసంపుటం పేరు | అచ్చయిన సం॥ | కథల సంఖ్య |
|---|---|---|---|
| 1 | వర్షించిన మేఘం | 1961 | 7 |
| 2 | ప్రాణదాత | 1962 | 5 |
| 3 | తానువెలిగించిన దీపాలు | 1963 | 8 |
| 4 | వక్రగతులు | 1968 | 7 |
| 5 | కళ్యాణ కింకిణి | 1968 | 10 |
| 6 | పునర్నవం | 1968 | 10 |
| 7 | కమ్మతెమ్మర | 1968 | 14 |
| 8 | మధురాంతకం రాజారాం కథలు | 1969 | 5 |
| 9 | రేపటి ప్రపంచం | 1975 | 12 |
| 10 | వగపేటిక | 1977 | 6 |
| 11 | వినోద ప్రదర్శనం | 1978 | 9 |
| 12 | వనభోజనం | 1979 | 7 |

ఈ సంపుటాలలోని కథలన్నీ ఏరికూర్చినవి. ఇందులో ఆరు కథలు రెండు సార్లు సంపుటాల్లో చేరాయి. "సంఘజీవి" కథ పునర్నవం, ప్రాణదాత అనే రెండు సంపుటాల్లోనూ, "కాటుకకంటి నీరు" కథ, మధురాంతకం రాజారాం కథలు, వినోద ప్రదర్శనం అనే రెండు సంపుటాల్లోనూ, "సర్కసుడేరా" కథ, తాను వెలిగించిన దీపాలు ప్రాణదాత సంపుటాలలోనూ, "విధివిలాసం" కథ వినోద ప్రదర్శనం, వర్షించిన మేఘం అనే రెండు సంపుటాల్లోను చేరాయి.

ఈ సంపుటాలలొ చేరిన రాజారాంగారి కథలు నూరయితే, అందులో పునః స్వీకృత కథలు ఆరు. ఈ ఆరింటిని తీసివేయగా మొత్తము సంపుటాలలొని కథల సంఖ్య తొంబదినాలుగు. ఇట్లా కొన్ని కథల్ని రెండుసార్లు చేర్చడానికి ఆ కథలపైన రచయితకుగల ప్రత్యేక అభిమానం కారణం కావచ్చు.

సంపుటాలలొ వచ్చిన కథలు, వివిధ పత్రికల్లో అచ్చయిన కథలన్నీ కలిపి పరిశీలించి చూస్తే రాజారాంగారి కథలు ఒక ప్రత్యేకమైన బాణీగల కథలుగా కనిపిస్తాయి. తెలుగు వాతావరణం, తెలుగువారి సంప్రదాయాలు, తెలుగు గ్రామీణ జీవన చిత్రణ, రాయలసీమ ఆచార వ్యవహారాలు, ఉపాధ్యాయుల జీవితాలు మొదలయినవి ఈ కథల్లొ కనిపిస్తాయి.

రాజారాంగారి కథలు ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

1. ఉపాధ్యాయుల కథలు
2. అనుబంధాల కథలు
3. రచయితల కథలు
4. మధ్యతరగతి విలువల కథలు
5. వరకట్న సమస్యల కథలు
6. రాజశేఖరం కథలు లేదా మేష్టారు చెప్పిన కథలు
7. విపరీత మనస్తత్వాల కథలు
8. లోకధర్మం కథలు
9. ప్రేమ కథలు
10. మిగతా కథలు లేదా ప్రకీర్ణాలు

## 1. ఉపాధ్యాయుల కథలు :

రాజారాంగారు స్వయంగా ఉపాధ్యాయులు. వారి కథల్లో పద్దెనిమిది కథలు ఉపాధ్యాయుల జీవితాలకు సంబంధించినవిగా కనిపిస్తున్నాయి వీటిలో కొన్ని కథలు ఉపాధ్యాయులు వృత్తిపరంగా ఎదుర్కొనే సమస్యలను చిత్రిస్తే, మిగతావి ఉపాధ్యాయుల వ్యక్తిగత జీవితాలను ప్రదర్శిస్తాయి. అంతేకాకుండా ఉపాధ్యాయుల విపరీత మనస్తత్వాలను చిత్రించే కథలు కూడా ఇందులో చేరాయి. స్థూలంగా రాజారాంగారి ఉపాధ్యాయుల కథలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. అంగరక్షకుడు : స్నేహధర్మాన్ని, సౌహార్దాన్ని కూడా త్యాగం చేసేంత వృత్తి నిరతి, నిజాయితీ గల సీతాపతి మేష్టారి కథ.

2. అడ్డుదారి : అవినీతికి ఆలవాలమైన విద్యా వ్యవస్థలో నీతిని నమ్ముకున్న సాంబశివం మేష్టారి కథ.

3. ఎమర్జెన్సీ : రిటైరై, పెన్షన్ డబ్బులు సమయానికిరాక, ఆకలి బాధను తట్టుకోలేకపోయిన డొక్కా జోగిరాజు మేష్టారు కథ.

4. ఇంటాబయట : ఇంట్లో దుర్భర దారిద్రాన్ని అనుభవిస్తూ, బయట పాకశాస్త్రం మీద ఉపన్యాసాలు చేసి తృప్తిపడే హరి చెంచయ్య మేష్టారు కథ.

5. గోదారి : జీవితమంతా ఊరికి ధారపోసి, చివరికి అదే ఊరికి తాను బాకీ దారుడని తేలేసరికి ఆశోపహతుడై నిష్క్రమించిన మణి వాళయ్య మేష్టారు కథ.

6. టీ కప్పుల్లో కల్లోలం : తనకు అందని సుఖాలు ఇతరులకు మాత్రం ఎందుకు అందా లనుకునే హెడ్‌మిస్ట్రెస్ విమలాదేవి కథ.

7. తానువెలిగిం చిన దీపాలు : శిష్యుల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోవడం కంటే ఉపాధ్యాయులకు కావలసినది మరేదీలేదని చాటిన కృష్ణశర్మ మేష్టారి కథ.

8. ద్వంద్వ సమాసం : గ్రామంలోని అసమానతలు బడిలో ఉండరాదని ధైర్యంగా మెరిట్‌కే ప్రాధాన్యం ఇచ్చిన జానకీ మేడం కథ.

9. దుష్టసమాసం : తాగుబోతు భర్తతో జీవితాన్ని భారంగా మోస్తున్న హెడ్‌మిస్ట్రెస్ ప్రమీలాదేవి కథ.

10. పతిదేవుళ్లూ ఆడకూతుళ్లు : కొడుకు చదువుకోసం తీసుకున్న 'లోను' కూతురు కాపురంలో చిచ్చు పెడితే నిస్సహాయుడైన గురుమూర్తి మేష్టారు కథ.

11. పిచ్చివెంకట్రావు: రూల్సుకంటే వ్యక్తి శ్రేయస్సు ముఖ్యమని నమ్మిన హెడ్మాష్టరు వెంకట్రావు కథ

12. మంచివాడికి సన్మానం : లంచగొండితనంతో బదిలీలు జరుగుతున్న కాలంలో కేవలం మెరిట్ మాత్రమే ఉన్న రమణమూర్తి మేష్టారు కథ.

13. మసిమరక : ఉపాధ్యాయుల మధ్య బడిలో జరిగిన చిన్న సంఘటన.

14. మెత్తనిపులి : పులిలాంటి హెడ్మాష్టరు బలరామయ్య గారికే ఎసరు పెట్టిన మెత్తని పులి గోపాలం కథ.

15. వ్యవస్థ : అవివాహితగా పల్లెటూల్లో పనిచేస్తూ శకుంతల టీచర్ ఎదు ర్కొన్న సమస్యల కథ.

16. వెలుగు సముద్రంలో చీకటిదీవి : కొత్తగా ఉపాధ్యాయుడుగా నియమించబడిన మేష్టారు గారికి అక్కడ ఎదురైన ఒక నిస్సహాయురాలయిన గృహిణి కథ

17. స్పాట్‌లైట్ : స్పాట్ వాల్యుయేషన్‌లో లైట్‌లాగా వెలిగినా, నిజ జీవితంలో చీకటిని నింపుకున్న నాగమణి టీచర్ కథ.

18 హాలికులు కుశలమా : ఇంగ్లీషు పద్ధతిలో తెలుగు సాహిత్యాన్ని చదివి వచ్చిన కుర్ర ఉపాధ్యాయుడు అవమానించాడని ఉద్యోగం వదిలి సేద్యం చేపట్టిన రాయదుర్గం నరసప్ప పంతులు కథ.

ఈ విధంగా ఉపాధ్యాయులకు సంబంధించిన అన్ని కోణాలూ ఈ కథల్లో కనిపిస్తాయి. వీటిలో రాజారాం గారు ఉపాధ్యాయుల సమస్యలను సానుభూతితో, మానవతా దృక్పథంతో పరిశీలించడాన్ని గమనించవచ్చు.

## 2. అనుబంధాల కథలు :—

విశ్వశ్రేయస్సు రాజారాంగారి కథల్లో ప్రధానంగా కనిపిస్తుంది. బీటలువారుతున్న కుటుంబ వ్యవస్థ, అడుగంటుతున్న అనుబంధాల స్వరూపాలు, వ్యక్తి కంటే డబ్బే ప్రధానంగా బావిస్తున్న సమాజ విలువలపట్ల ఆవేదన రాజారాంగారి కథల్లో ప్రతిబింబిస్తుంది. అనుబంధాలు పటిష్టంగా ఉండాలనే సందేశం పారదర్శకంగా గోచరిస్తుంది. అందుకే ఈ అనుబంధాల కథలను హృదయస్పర్శి కథలని అనవచ్చు.

రాజారాంగారి అనుబంధాల కథలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. అనామకుడు : కష్టపడి కొడుకును చదివిస్తే వాడు ప్రయోజకుడై ధనవంతుల కూతుర్ని పెళ్ళి చేసుకుంటాడు. ఆ పెళ్ళిలో అనామకుడిగా మిగిలిన పల్లెటూరివాడైన పెళ్ళికొడుకు తండ్రి కథ.

2. ఎండమావి : సుందరం వడివేలు పెంచుకొన్న అనుబంధాలు ఎండమావులని తెలిపే కథ.

3 ఏకాకి : చిన్ననాటనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న మనవణ్ణి అవమానాలనుండి కాపాడి పెంచిన అమ్మమ్మ, చివరికి అదే మనవడితో పనిమనిషిగా పరిచయం చేయబడిన కథ.

4 కూనలమ్మకోన : రంగనాథాన్ని నమ్మి తన సర్వస్వాన్ని సమర్పించి ఉంపుడుగత్తెగా ముద్రవేయించుకున్న నాగరత్నం కథ

5 మమకారం : తనను తలుచుకొని కొడుకు కోసం కళ్ళలో ప్రాణాలు నిలుపుకొని పూరిగుడిసెలో, కుక్కిమంచంలో పడివుండి ఎదిరిచూస్తున్న నారప్ప కథ.

6. మనుషులు : కొడుకులెంత దుర్మార్గులయినా తల్లి మనసు వారివైపే మొగ్గు
మమకారాలు తుందని తెలిపే పార్వతమ్మ కథ.

7. మయసభ : దొంగగా ఊహించుకున్న వ్యక్తి తన తండ్రి అనీ, దగాపడ్డ స్త్రీ జానకి తన తల్లి అనీ తెలిసేసరికి సూర్యనారాయణకు ఏమీ మిగలలేదు. ఈ కథ అనుబంధాల మయసభ

8. నోరులేని : గ్రామ రాజకీయాలలో నలిగి పోలీసులపాలయిన తండ్రి స్థితిని
జీవుడు చూసి హృదయం ముక్కలైన మూగ కనకం హృదయస్పర్శి కథ.

9. చీమలుపెట్టిన : నడమంత్రపు సిరి అనుబంధాలను చంపుతుందని తెలిపే
పుట్టలు కథ

10. వగపేటికి : పాలు పెరుగు అమ్మి కష్టపడి కొడుకును చదివించి ఉన్నతం
చల్లచిందినన్ గా తీర్చిదిద్దిన తల్లిని కొడుకే అవమానిస్తే, బ్రతుకు దెరువు కష్టమై పోయిన తల్లి తులసమ్మ కథ.

11. వినోద : దరిద్రుని ఆకలి పోరాటం లోకానికి వినోద ప్రదర్శనం. వారి
ప్రదర్శనం అనుబంధాలకు సంఘంలో విలువలేదు అని తెల్పే కథ.

12. మాతృసప్తకం: వారాలు చేసుకుని చదివి పైకివచ్చి ఉద్యోగంచేస్తూ పెళ్ళిచేసుకుని భార్యతో కలిసి, తాను వారాలు చేసుకున్న ఏడుగురు తల్లుల ఇంటికి రావడం అనే అనుబంధాలు ఇమిడివున్నకథ.

## 3. రచయితల కథలు :

రచయితల జీవితాలలోని విశేషాలను రచయిత మాత్రమే చెప్పగలడని ఈ కథలు నిరూపిస్తాయి. రచయితల జీవితాలలో ఎదురయ్యే సమస్యలు, సన్మానాలు పాఠకులనుండి వచ్చే ఉత్తరాలు మొదలైనవి రచయితల కథల్లో చోటుచేసుకున్నాయి. రాజారాం గారు స్వయంగా రచయిత కనుక రచనల గురించి కొన్ని సొంత అభిప్రాయాలను ఈ కథల్లో వ్యక్తపరిచారు. కొన్నయితే రాజారాంగారి స్వీయానుభవాలుగా తోస్తాయి ఆ కథలు ఈ విధంగా ఉన్నాయి.

1 చేదు నిజం : కలల్లో తేలిపోతున్న యువతరాన్ని వాస్తవ జీవితంలోకి తీసుకువచ్చి కథలు కల్పనలు కాకూడదని రచయిత రాధాపతి కల్పించి చెప్పిన కథ.

2 జారుడుమెట్లు : సాహిత్యంతో పొట్ట గడవనపుడు పలాయితుడైన రచయిత నీల కంఠం, అదే సాహిత్యాన్ని వ్యాపార రీతిలోకి మలచిన నీల కంఠం కొడుకు వీరిద్దరి జమిలి కథ

3 భూమార్గం : తెలుగు వాతావరణాన్ని, తెలుగు సమస్యలను వదిలి ఆకాశ యానం చేస్తున్న తెలుగు రచయితలను భూమార్గం పట్టమని చెప్పుతున్న ఒక రచయిత కథ

4 ధర్మగ్లాని : ఎప్పుడూ సాహిత్య విలువల్ని చర్చిస్తూ అవి పడిపోతున్నా యని బాధపడే రచయిత వ్యాసమూర్తి కథ.

5 లెస్‌లగేజ్ మోర్‌కంఫర్ట్ ; దిగజారిన జారుతున్న సాహిత్యపు విలువల్లో ఇమడలేక పోయిన రచయిత రాజశేఖరం కథ.

6 ఘన సన్మానం ; ప్రతి గొప్పవ్యక్తి వెనక ఒక స్త్రీ వుంటుందనే అభిప్రాయంతో రచయిత భార్యకు చేసిన సన్మానం

7. సన్మానం ; ఒక అజ్ఞాత పాఠకుడు ఎదురై గౌరవిస్తే ఆ ఆనందం ముందు, ఏ పారితోషికమూ పనికిరాదని సంతోషించిన ర యిత కథ.

## 4. మధ్యతరగతి విలువల కథలు :

"మధ్యతరగతి ప్రజల్లో సహజంగా ఉండే లోభాలు, వెకిలి ఆశలు, పిచ్చి ఊహలు, బాధలు, ఆప్యాయతలు అన్ని మధురాంతకం రాజారాంగారి కథల్లో ప్రతి బింబిస్తాయి" అంటారు పాలగుమ్మి పద్మరాజు గారు 5

"ఇతని పాత్రలన్ని మధ్యతరగతి విలువల్ని ఆమోదించేవే! తిరుగుబాటు కాన రాదు" అంటారు కొడవటిగంటి కుటుంబరావు గారు 6

సంప్రదాయ వాతావరణాన్ని వదిలిపెట్టకుండా వుంటూ కాలానుగుణంగా మారుతున్న యుగ ధర్మాలను సులభంగా ఆమోదించకపోవడం మధ్యతరగతి జీవితాల్లో కనిపిస్తుంది. మధ్యతరగతిలో అనుబంధాలు - సంప్రదాయాలు సజీవ గా ఉంటాయి చాలావ కు వీరిలో తిరుగుబాటు ధోరణి కనిపించదు.

---

5. "రేగటి ప్రపంచం" కథా సంపుటం, ముందుమాట, పాలగుమ్మి పద్మరాజు.

6. "కమ్మతెమ్మర" కథా సంపుటం. రివ్యూ, ఆంధ్రప్రభ - వారపత్రిక 29-10-89 కొడవటిగంటి కుటుంబరావు.

మధ్యతరగతి వాడి దృష్టి ఎప్పుడు పై తరగతిమీఁదే! కాని పైకిపోవడానికి అతని ఆర్థిక పరిస్థితులు సహకరించవు. పరిమితమైన ఆర్థిక వనరులు, అపరిమిత మైన కోరికల మధ్య జరిగే సంఘర్షణలో నలుగుతూ ఉంటాడు అతడికి క్రిందివాడి పట్ల ఎప్పుడూ చిన్నచూపే! ఆర్థిక సమస్యలకు తోడు సాంప్రదాయక ఆచారవ్యవహా రాలు తోడై మధ్యతరగతి మనిషిని కృంగదీస్తున్నాయి

రాజారాంగారు మధ్యతరగతి విలువల కథలు ఈ విధంగా వున్నాయి

| | | | |
|---|---|---|---|
| 1 | త్రిశంకుడి స్వర్గం | : | పై వాడు తనను ఉపయోగించుకుంటున్నాడు. అవమాని స్తున్నాడని తెలిసినా గొప్పకోసం వాడివెంట తిరిగే మధ్యతర గతి ప్రతినిధి కామేశం కథ. |
| 2 | పతిదేవుళ్లూ ఆడకూతుళ్లు | : | సంప్రదాయాలకు విలువనిచ్చే సాంబశివం మేష్టారు తీసుకున్న 'లోను' కూతురు కాపురం చెడిపోవడానికి కారణమైన కథ. |
| 3 | పుట్టిల్లు | ; | పుట్టినిల్లు ప్రతి అడకూతురికి ముఖ్యం, అదిలేకపోతే! |
| 4 | నిషిద్ధాక్షరి | ; | ముక్కుతాడు లేని స్వేచ్ఛ నిషిద్ధాక్షరి వంటింది. |
| 5 | లెస్‌లగేజి మోర్‌కంఫర్ట్ | ; | మధ్యతరగతిలో ఇముడలేక పైతరగతికి చేరుకుని అక్కడా ఇముడలేక తిరిగి కిందికి రాలేక త్రిశంకుడి స్వర్గంగా మిగిలిన మురళి కథ |
| 6 | సంఘజీవి | ; | సంఘంలో నివసిస్తున్నప్పుడు సంఘధర్మాలకు కట్టుబడి ఉండాలి, లేదా సంఘం నుండి పారిపోవాలనిపించడం సహజం. |
| 7 | స్వస్థానం | ; | కింది తరగతిలో ఇముడలేక పైతరగతికి వెళ్లి వారితో అవ మానించబడి తన స్థానమెక్కడో తెలుసుకుని కింది తరగతికే చేరుకున్న నీరజ కథ. |
| 8 | వ్యాపకం | ; | మధ్యతరగతి హిపోక్రసీ కథ. |
| 9 | వికారాలు మమకారాలు | ; | ఉన్నత విద్యలనభ్యసించి, ధనవంతుల అమ్మాయిని పెళ్ళి చేసుకుని పట్నంలో ఉంటూ కష్టపడి చదివించిన పెద్ద మామయ్యను మరిచిపోయిన చిన్నమామయ్య కథ. |

10 వైరాగ్యంతో సరాగం ; దారిద్ర్యానికి భయపడి పలాయితుడైన మాధవయ్య మామ తిరిగి గృహస్థుడై ధనవంతుడైతే మళ్ళీ సన్యాసివైపొమ్మనడం ఎంతవరకు భావ్యం ?

11 అరుదైన అవకాశం : మధ్యతరగతి యువకుడు పెళ్ళివలన పెరిగిన అంతస్థుతో పైకి ఎగబాకాలనుకుని కిందికి దిగజారిన సుందరం కథ.

12 సుడిగుండం ; ఉన్నత విద్యలు ఉమ్మడి కుటుంబాలను బీటలు వార్చుతున్నాయన్న ఆవేదన.

13 మహానటుడు ; మంచి గుణాలన్నీ తనుంచుకుని చెడు లక్షణాలన్నీ భార్యకు అంటగట్టి తాను మాత్రం మంచివాడుగా చెలామణి అవుతూ జీవితంలో నటిస్తున్న మహానటుడు శ్రీ ఎన్నారాయణ కథ

మధ్యతరగతి జీవితాలలోని లోటుపాట్లను సానుభూతితో పరిశీలిస్తూ వాటిలోని లొసుగులను వ్యంగ్యంగా విమర్శిస్తూ సాగిన ఈ కథల్లో మధ్యతరగతి భేషజాలను వ్యంగ్యంగా నిరసించినా మధ్యతరగతి విలువలే ఉన్నతమైనవి అనే రావూరిగారి అభిప్రాయం పారదర్శకంగా గోచరిస్తుంది.

## 5. వరకట్న సమస్య కథలు :

వరకట్న సమస్య పీడిస్తున్నది మధ్యతరగతి ని మాత్రమే అని, సగటు మధ్య తరగతి మనిషికి ఆడపిల్ల పెళ్ళి ఎంతటి భారాన్ని కలిగిస్తున్నదో అనే రచయిత ఆవేదన ఈ కథల్లో చూడవచ్చు

వరకట్న సమస్య కథలు ఈ విధంగా ఉన్నాయి.

1 అక్కయ్య అంతరంగం ; సొంత అక్కయ్య అయినా వియ్యమందే సమయంలో సాంప్రదాయక అహంభావం తప్పకుండా వుంటుందని తెల్పే కథ

2 సంధ్యా సమస్యలు ; వరకట్న దురాచారాన్ని మూలంనుండే నాశనం చేయాలని యువతరం తిరుగుబాటు చెయ్యాలనే సందేశం అందించే కథ

2 కన్నెచెర ; ఆడపిల్లల తండ్రులకు కూతురు పెళ్ళి సమస్యయితే మగ పిల్లల తండ్రులకు కొడుకుల చదువులూ, ఉద్యోగాలు సమస్యలే అని చెప్పే కథ.

4 భాగ్యవిధాతలు ; మగపిల్లల తండ్రులు కట్నాల విషయంలో చేసే బేరసారాలు అవి చూసి ఆవేదన పడే మేష్టారు ఈ కథలో వుంటారు.

5 కొరకరానికొయ్య: ఆడపిల్ల పెళ్ళికోసం తల్లిపడే ఆవేదనే ఈ కథ.

## 6. రాజశేఖరం కథలు లేదా మేష్టారు చెప్పిన కథలు :

ఈ కథలను ఉత్తమ పురుష కథలు అనవచ్చు. రాజశేఖరం గానీ, మేష్టారు గానీ ఈ కథలు చెప్తారు. ఆయా కథల్లో వీరిద్దరూ పాత్రలే కాక కథా గమనానికి కూడా కారకులవుతారు. ఈ కథలో చాలా మట్టుకు మామయ్యలు, బాబాయిలు ప్రధాన పాత్రలుగా ఉంటారు. ఈ కథల్లోకి రచయిత పాత్ర నేరుగా ప్రవేశించదు కానీ రచయితే రాజశేఖరం లేదా మేష్టారు రూపంలో ముందుకు వస్తున్నాడని గుర్తు పట్టడం పాఠకునికి అంత కష్టమేమీ కాదు. ఇంతే కాకుండా రచయిత రామాపతి వ్యాసమూర్తి అనే పాత్రల ద్వారా కూడా కథ చెప్పిస్తాడు కొన్ని కథల్లో కథ చెప్పు కుంటూ పోవడమే కానీ ఎవరు చెప్తున్నారో తెలియదు. అటువంటి చోట నేరుగా రచయితే కథ చెప్తున్నాడని తెలుస్తుంది. అంటే కొన్ని కథల్లో రచయిత స్వయంగా పాత్ర ధారిగా, కొన్నింటిలో సూత్రధారిగా వ్యవహరిస్తారు.

పై కథలు ఈ విధంగా ఉన్నాయి.

1 అద్వైతం : అన్ని మతాలు సమానమని భావించే టూరిస్టు బస్సు డ్రైవర్ గంగూలీ గురించి రాజశేఖరం చెప్పిన కథ.

2 ఆశ్రయం : ఒక ప్రఖ్యాత చిత్రకారుని జీవితాన్ని గురించి రాజశేఖరం చెప్పిన కథ

3 అనివార్యం : మారుతున్న కాలంలో ఆప్యాయతలు - అనురాగాలు తగ్గిపోతున్నాయని బాధపడే రాజశేఖరం మేష్టారి కథ.

4 ఎదురుగాలి : రంగనాథం బాబాయిని గురించి రాజశేఖరం చెప్పిన కథ.

5 కళ్యాణకింకిణి: నాగరాజు పెళ్ళికి వెళుతున్న రాజశేఖరం ఆలోచనల పర్యవసానమే ఈ కథ.

6 పాంథశాల : తాను కథలో జీవిస్తూనే మామయ్య కథ చెప్పిన రాజశేఖరం కథ.

7 పురుషులకు ప్రత్యేకం : శారదా, నరహరిల గురించి రాజశేఖరం చెప్పిన కథ

8. తిరస్కృతి : కథలో పాత్రగా ఉంటూ సుందరమ్మత్త గురించి రాజశేఖరం చెప్పిన కథ.

9. తృప్తి : తాను కథలో జీవిస్తూనే శ్రీహరి గురించి రాజశేఖరం చెప్పిన కథ.

10. త్రిశంకుడికథ : కామేశం గురించి రచయిత చెప్పిన కథ.

11. వక్రగతులు : బాబాయి కూతురు రాధ ఆమె భర్త మురారి గురించి రచయిత చెప్పిన కథ.

12. టీ కప్పుల్లో కల్లోలం : హెడ్ మిస్ట్రెస్ విమలాదేవి గురించి రాజశేఖరం మేష్టారు చెప్పిన కథ.

13. తలుపులూ-తాళాలు : తలుపులూ తాళాలు గురించిన రచయిత అభిప్రాయాలు.

14. చలిచెలమ : అంజిగాడనే అభాగ్యుడు మతం మార్చుకుని ఆఫీసరవుతాడు. కానీ అతని మనస్సు మాత్రం మారదు. ఆ కథను రాజశేఖరం చెప్పుతాడు.

15. మిస్. మరీచిక : మధుసూధనం కథ మేష్టారు చెప్పుతాడు.

16. యోగి : సంసారంలోని సమస్యలకు భయపడి సన్యాసిగా మారిన శుద్ధానంద భారతీస్వాములవారి గురించి రాజశేఖరం చెప్పిన కథ.

17. ముగ్గురు నిర్భాగ్యులు : కన్నతల్లివంటి సొంత ఊరిని వదిలి, ఎండమావులవంటి పట్టణాలకు తరలిపోయే మిత్రుని వారిస్తూ కథలో పాత్రగా వున్న రాజశేఖరం కథ.

## 7. విపరీత మనస్తత్వాల కథలు :—

పుర్రెకోబుద్ధి జిహ్వాకోరుచి అన్నట్లుగా మనుషులందరూ ఒకేరకంగా వుండరు. అందరి మనస్తత్వాలు ఒకే రకంగా వుండవు. ఇలా వేరువేరు మనస్తత్వాలు వుండటా

నికి సంఘంలోని పరిస్థితుల ప్రాబల్యమే ఎక్కువగా కనిపిస్తుంది. ప్రతి మనిషీ మంచి వాడుగానో చెడ్డవాడుగానో పుట్టడనీ వాడు పెరిగిన వాతావరణం; పరిసరాల ప్రభావం మొదలైనవి వాడి చిత్తవృత్తి వికసించడానికో ముడుచుకు పోవడానికో కారణాలవుతున్నాయని తెలుస్తున్నది.

"20వ శతాబ్ది ప్రారంభంలో మేధో ప్రపంచంలో గొప్ప అలజడిని సృష్టించిన సిగ్మండ్ ఫ్రాయిడ్ 'డెప్త్‌సైకాలజీ' (Depth Psycology), తరువాత ప్రచారంలోకి వచ్చిన ఆల్‌ఫ్రెడ్ అడ్లర్ 'ఇండివిడ్యువల్ సైకాలజీ' (Individual Psycology), గూస్టాఫ్‌యూంగ్ 'ఎనలజికల్ సైకాలజీ' ల ప్రభావం తెలుగు కథకులపై ప్రసరించింది. సైకో ఎనాలిసిస్ సిద్ధాంతాల ప్రభావంగా "అచేతన" గురించిన అవగాహన కథారచయితలకు ఇతివృత్తాల ఎంపిక విషయంలోనూ, పాత్రచిత్రణ విషయంలోనూ కొత్త పుంతలు తొక్కేందుకు తోడ్పాటునిచ్చింది " 7

రాజారాంగారు, బుచ్చిబాబు, గోపీచంద్ ల వలె 'సైకో ఎనాలిసిస్ సిద్ధాంతాల' ఆధారంగా కథలు రాయక పోయినా ఈ సిద్ధాంతాల అవగాహన వారి కథల్లో కనిపిస్తుంది. దానికి ఉదహరణగా ఈ క్రింది కథలను పేర్కొనవచ్చు

'కామదహనం' అనే కథలో చలపతి అనే ఒక బుద్ధిమంతుడైన యువకుడు ఉంటాడు. అతడు బయటి ప్రపంచానికి బుద్ధిమంతుడే! కాని అతని అంతరంగం బూతు ప్రపంచం. అతని ఆలోచనలన్నీ అదేవిధంగా సాగుతుంటాయి చివరికి తన ఆలోచనలకు అక్షర రూపం కల్పించి, కామవర్ధన్ పేరుతో బూతు కథలు రాసి శృంగార పత్రికలలో ప్రచురిస్తూ ఉంటాడు. అతడీ సాహితీ రంగంలో మంచి కథకుడిగా పేరుతెచ్చుకుంటాడుకూడా! అయితే ఈ విషయాలన్నీ గోప్యంగానే వుంటాయి. పెళ్లయింతరువాత భార్య ఈ విషయం తెలుసుకుని అతని కథలు ప్రచురించబడిన పత్రికలన్నీ బాయిలర్‌లోవేసి కాల్చి అదే నీటితో చలపతికి స్నానం చేయిస్తుంది. కామదహనం. చిత్రంగా చలపతి మారిపోతాడు, ఇప్పుడు బూతు కథలు రాయడం మానేస్తాడు.

---

7. తెలుగుకథ—మానసిక విశ్లేషణ - కోడూరి శ్రీరామమూర్తి - ఆంధ్రప్రభ - దినపత్రిక 9-9-84

ప్రతివ్యక్తిలోనూ కోరికలు ఉంటాయి. అయితే వాటిని బహిర్గతం చేయడంలో తేడాలుండవచ్చు. అందులో కొన్ని అణచివేయబడిన కోరికలు (Process of Repression) ఉంటాయి. అవి ఏదో రూపంలో బహిర్గతం కావడానికి ప్రయత్నిస్తుంటాయి. అవి కలల రూపంలో కాని మరో రూపంలో కాని బయటపడతాయి. అలా బయటికి వచ్చిన కోరికలు రూపాంతరీ కరణం (Process of Sublimation) చెందుతాయి.

ఈ రూపాంతరీకరణ మనుషుల వ్యక్తిత్వాలను బట్టి ఉంటుంది. "కామదహనం" కథలో చలపతి రచయితగా తన రచనలద్వారా కోరికలను తీర్చుకుని లేదా భావోద్వేగాలను అణచుకొని తృప్తి పొందాడు అదే మరే కళాకారుడో అయితే తన కళల్లో కోరికల రూపాంతరీకరణను ప్రతిబింబించుకుని తృప్తిని పొందేవాడు చలపతి కి పెళ్లయింతర్వాత కోరికలు తీరాయి కనుక ఇక కథలు రాయడం మానివేశాడు.

ఈ విధంగా కోరికలను బహిర్గతం చెయ్యలేనప్పుడు లేదా దానికి అవకాశం లేనప్పుడు తీవ్ర ఒత్తిడికిలోనై అపసామాన్య ధోరణి (Abnormal) కి మారే ప్రమాదము ఉన్నది. ఇది పరపీడనాసక్తి (Sadism) కి దారితీస్తుంది.

ఈ శాడిజం మనస్తత్వంగల పాత్రలు "పురుషులకు ప్రత్యేకం" కథలో చూడవచ్చు ఈ కథలో నరహరి శారదను హింసించి రెచ్చగొడతాడు. అయితే అనుకూల వాతావరణం ఉంటేనే శాడిస్టులు శాడిజాన్ని ప్రదర్శించగలరనే సత్యాన్ని చెపుతాడు రచయిత

ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం Id, Ego, Super Egoలు కారణమవుతున్నాయని తెలుస్తున్నది.

అహం (Ego) ప్రతివ్యక్తిలోనూ ఉంటుంది అది మానసికమైనది. కోరికలను బహిర్గతం చెయ్యడానికి అధ్యహం (Super Ego) కారణమవుతున్నది

ఒక వ్యక్తి తాను చాలా అందంగా ఉన్నాననుకోవడం లేదా తాను చాలా ధనవంతుడని భావించుకోవడం 'అహం' అయితే దాన్నందరూ హర్షించాలనుకోవడం 'అధ్యహం'గా చెప్పవచ్చు 'అహం' మానసికమైనది అయితే 'అధ్యహం' సామాజికమైనది.

'టీ కప్పులో కల్లోలం' కథలో విమలాదేవి పాత్ర అధ్యాహంలో కనిపిస్తుంది ఆవిడ తాను చేస్తున్న ప్రతిపనినీ సంఘం ఆమోదించాలనుకుంటుంది. దాంతోపాటు తాను చేస్తున్న ప్రతిపని సరైనదే అనే అభిప్రాయంకూడా ఆమెకు ఉన్నది. ఇతరులు చేస్తున్న పనులన్నీ పనికిమాలినవని ఆమె నమ్మకం. తాను పెళ్లిచేసుకోలేదు కనుక ఇతరులు చేసుకోవడం ఆమెకు హితవుగాని పని. సంసారంలో వ్యక్తిస్వేచ్ఛ ఉండదని పెళ్లి చేసుకున్న వాళ్లందరూ సుఖవంతమైన జీవితాన్ని గడపటంలేదని ఆమె చెప్తూ ఉంటుంది.

ఇటువంటి వ్యక్తులతో వారి మనస్తత్వాలకు వ్యతిరేకమైన పనులు చేయించడంవల్ల వాళ్లు మామూలు మనుషులవలె మారే అవకాశం ఉంది. 'టీ కప్పులో కల్లోలం' కథలో విమలాదేవి పెళ్ళి చెయ్యడం అనే ముగింపుకు కారణం అదే. ఈమె మనస్తత్వంలో మార్పు వచ్చిందన్న సూచనతో కథ ముగుస్తుంది.

తల్లిప్రేమ తాను మాత్రమే పొందాలనే భావాన్ని Self love అంటారు. ఈ Self love వ్యక్తి స్వార్థానికి సంబంధించినది. ఇది స్వానురాగం (Narsissism) అనే భావానికి దారి తీస్తుంది. ఈ స్వానురాగం ప్రాథమిక, గౌణ, అని రెండు రకాలుగా (Primary and secondary) వుంటుంది. మొదటిది చిన్న వయస్సులో రెండోది వయస్సు పెరుగుతున్న సమయంలో ఉంటాయి. చిన్న పిల్లలలో తల్లిప్రేమ తమకు మాత్రమే పరిమితం కావాలనుకునే భావాన్ని గమనించవచ్చు వయస్సు పెరిగేకొద్దీ ఈ ప్రేమలో మార్పు వస్తుంది కానీ కొందరిలో వయస్సు ముదిరినా ఈ భావం రాదు. వారి మానసిక వికాసం ప్రాథమిక స్వానురాగం వరకే ఆగిపోయిందన్న మాట. అటువంటివారు ఇతరులను ప్రేమించలేరు. సహజంగా ప్రేమను పొందలేరు

దీనిని 'చెక్కుటద్దం' కథలో చూడవచ్చు వాసంతి స్వానురాగంతో ఎవరినీ ప్రేమించదు, ప్రేమను పొందదు. ఆమె మానసిక వికాసం పరిణతి పొందలేదని రచయిత అభిప్రాయం చూడవచ్చు.

కానీ చంద్రమోహన్, సక్కుబాయిల అన్యోన్య దాంపత్యం చూపిన తరువాత వాసంతిలో మార్పు వస్తుంది. అనగా ఆమె ప్రాథమిక స్వానురాగం నుండి గౌణ స్వానురాగానికి చేరుకుంటున్నది అనే సూచనతో కథ ముగుస్తుంది.

ఒక్కొక్కసారి మనిషిలో తాను చాలా అల్పున్ని అనే భావం యేర్పడుతుంది. సాధారణంగా తమకంటే గొప్ప వ్యక్తులను చూసినప్పుడు ఇలా జరుగుతుంది. దీనిని "ఆత్మన్యూనతా భావం" (Inferiority complex) అంటారు. మనిషి తనలోని అల్పత్వాన్ని ఇతరులకు తెలియకూడదని ప్రయత్నిస్తుంటాడు. తనగురించీ, తనకు తెలిసిన విషయాల గురించి వీలయినన్ని అతిశయోక్తులు జోడించి చెప్తూవుంటాడు. ఆ విధంగా చెయ్యకపోతే వారిలో "ఏకాకితనం" (Isolation) వస్తుంది. ఇటువంటి వారే ఆత్మహత్యలకు పాల్పడుతుంటారు.

రాజారాంగారి "ఇంటాబయట, ప్రజాపతి" అనే రెండు కథల్లో "ఆత్మన్యూనతాభావాన్ని" చూడవచ్చు "ఇంటాబయటా" కథలో హరి చెంచయ్య మేష్టారు బీదవాడని లోకమంతా తెలుసు. అయినా అతడు వీలయిన చోటల్లా రకరకాల వంటకాల గురించి మాట్లాడుతూ, రుచులను వర్ణిస్తూ ఉంటాడు ఇది హరి చెంచయ్య మేష్టారు తన ఆత్మన్యూనతాభావాన్ని కప్పిపుచ్చుకోవడానికేనని తెలుస్తున్నది. అదేవిధంగా "ప్రజాపతి" కథలో విశ్వపతి తనను గురించి గొప్పగా చెప్పుకుంటూ ఉంటాడు. అతని గురించి అందరికీ తెలుసు.

రాజారాంగారి కథల్లో విపరీత మనస్తత్వాల కథలు ఈ విధంగా వున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1 | ఇంటాబయట | : | ఇంట్లో ఉన్న దారిద్ర్యాన్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రతిచోట వంటల గురించి, రుచుల గురించి ఉపన్యాసాలు చేసే హరి చెంచయ్య మేష్టారి కథ. |
| 2. | కామదహనం | : | అడగాలి తాకిడికే చెదరిపోయే చలపతిలో బూతుకథలు రాసే కామవర్దన్ దాగి ఉన్నాడని తెలిపే కథ. |
| 3. | చెక్కుటద్దం | : | స్వానురాగంతో జీవితాన్ని వ్యర్థం చేసుకున్న నర్స్ వాసంతి కథ. |
| 4. | టీ కప్పుల్లో కల్లోలం | : | తమ పనులే గొప్పవనీ, ఇతరుల పనులు పనికిమాలినవని భావించే సూపర్ ఇగోవున్న విమలాదేవి కథ. |
| 5. | ప్రజాపతి | : | ఉన్నది లేనట్లుగా, లేనిది ఉన్నట్లుగా భావించుకుని తృప్తిని పొందే విశ్వపతి కథ. |
| 6. | పురుషులకు ప్రత్యేకం | : | భార్యను హింసించే నరహరి, అతన్ని రెచ్చగొట్టే కోదండం, ఇద్దరు శాడిస్టుల కథ. |

| | | |
|---|---|---|
| 7. వ్యవస్థ | : | శకుంతల జీవితాన్ని చెడగొట్టబోయి విఫలురైన కోపంతో ఆమె మీద నిందలు మోపి తృప్తి పడుతున్న నర్సింహులు, రామ్మూర్తుల కథ. |

## 8. లోకధర్మం కథలు :—

లోకంలో ఎన్నో సంఘటనలు జరుగుతూ వుంటాయి. వాటి కార్యకారణ సంబంధాలలోకి వెళ్ళడం వలన ప్రయోజనం లేదు. అవి అట్లా జరుగుతాయనడానికి గతంలో, వర్తమానంలో ఎన్నో దృష్టాంతాలున్నాయి.

వాస్తవ సంఘటనలే ఒకోసారి కథలవలె జరుగుతుంటాయి. రాజారాంగారి కథలు చాలా వరకు వాస్తవాభాసం కలిగించడానికి కారణం ఇదే కావచ్చు. రాజారాంగారు వస్తువు, శిల్పం గురించి మాట్లాడుతూ పై అభిప్రాయాన్నే వ్యక్తంచేశారు. 8

లోకంలో సామాన్యంగా జరిగే కథలే లోకధర్మం కథలు. ఈ సంఘటనలు ఈ విధంగా ఎందుకు జరుగుతాయి? వీటికి పరిష్కారం ఏమిటి? అనేది రచయిత సూచించకపోవడం గమనించాలి. అది లోక రివాజు అలా జరగడం లోకధర్మం అని రచయిత అభిప్రాయపడుతున్నట్లు కనిపిస్తుంది. ముఖ్యంగా ప్రభుత్వ యంత్రాంగంలోని అవకతవకలను అన్యాయాలను వ్యంగ్యంగా విమర్శించడంకూడా లోకధర్మంగానే రచయిత స్వీకరించినట్లు తోస్తుంది.

లోకధర్మం కథలు ఈ విధంగా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| 1 అడవిలో ధర్మదేవత | : | ప్రభుత్వ విధానాలు కాకులను కొట్టి గద్దలకు వేసే విధంగా ఉన్నాయనే విమర్శ. అమాయకులకు అన్యాయం జరుగుతుందని తెలిపే కథ |
| 2 అప్పాల నరసయ్య | : | సంఘానికి నీతి నిజాయితీ లేదు అవి ఉన్నవాడు సంఘంలో ఇముడలేడు. సంఘం ఇముడనివ్వదు. |
| 3 ఆడవాళ్ళ అంతరంగం | ; | ఆడవాళ్ళ ధోరణులు విభిన్నంగా ఉంటాయి. కానీ భర్త పరాయిస్త్రీ సాంగత్యాన్ని కోరితే ఏ భార్యా సహించదు. ఈ విషయంలో ఆడవారి అంతరంగాలన్నీ ఒక్కటే అనితెలిపేకథ |

---

8 "వస్తువు శిల్పం" వ్యాసం. మధురాంతకం రాజారాం. (అముద్రితం)

4 ఆశ్రయం : వ్యాపార దృష్టిలేని నిజాయితీగల చిత్రకారుని జీవితకథ.

5 ఎక్కవలసిన రైలు : ఏ వయస్సు ముచ్చట ఆ వయస్సులోనే తీర్చుకోవాలి. లేదా అటువంటి అవకాశం జీవితాంతం రాకపోవచ్చు.

6 ఒకేకాడ రెండుపువ్వులు : పుట్టి పెరిగిన వాతావరణమే మనిషి మానసిక వికాసానికి కారణమవుతుంది.

7 కార్టూన్ : ఇతరుల జీవితాలను నవ్వులపాలు చేయబోయి తానే ఎందుకూ పనికిరాకుండాపోయిన రామనాధ కథ.

8 కుంపట్లో కుసుమం ; నాటకాల రమణిని ప్రేమించి పెళ్ళి చేసుకుని పిచ్చివాడయిన రంగడి సినిమా ఫక్కి కథ.

9 కోరినకోనలో కురవనివాన : తిండికోసం మొహం వాచిపోయిన వ్యక్తి ధనవంతుడై అన్నీ ఉన్నా తినలేకపోవడం ఈ కథలోని ఇతివృత్తం.

10 జాగరూకుడు : తానే జాగరూకుడు అనుకుంటే తనను తలదన్నే వాడుంటాడనే లోకధర్మం కథ.

11 అజ్ఞాతవాసం : ప్రాథమిక సమస్యలను వదిలి అభివృద్ధి చేస్తే అది మరో సమస్యను సృష్టిస్తుంది.

12 అరణ్యరోదనం: ముసలివాడు పడుచు భార్యను పెళ్ళిచేసుకుంటే ఇంట్లో ఏర్పడే విపరీత పరిస్థితులు.

13 జగన్నాటకం ; కళా రూపంలో ఉంటే మెచ్చుకునే సంఘం వాస్తవాన్ని అంగీకరించదు.

14 పులిపైనస్వారి : సినీలోకపు మాయా రాజకీయాలు.

15 బ్రతుకనేర్చిన వాడు : తనతప్పులను సమర్థించుకుంటూ, ఆత్మవంచనా పరవంచనా చేస్తున్న వీరబదర్ం కథ.

16 సర్కసుడేరా : మానవ జీవితమే ఒక సర్కసు వంటిది.

## 9. ప్రేమ కథలు :

రాజారాంగారి కథల్లో సాధారణంగా ప్రేమకథలు కనిపించవు. కుటుంబ పరిధిలో జరిగే సాంప్రదాయక వివాహాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం చూడవచ్చు. అయితే రాజారాంగారు ప్రేమకు వ్యతిరేకి కాదు. ప్రేమవల్ల భాగుపడేవాళ్లుకూడా వుంటారు అనే దృష్టితో ఈ మూడు కథలు కనిపిస్తున్నాయి.

1 ప్రియబాంధవి : బడిపంతులు సత్యమూర్తిని ప్రేమించిన పంకజం కథ. వీరిద్దరూ ఊరు విడిచి వెళ్ళిపోయి పెళ్ళి చేసుకుంటారు.

2 సబల : ఒంటరిగా జీవిస్తూ ధైర్యంగా ప్రేమించిన వ్యక్తిని పెళ్లిచేసుకున్న సబల విశాల కథ.

3 ముక్కుడాడు : ఎదురింటి అమ్మాయిని లేవదీసుకుపోయిన రామనాథం బుద్ధిమంతుడు అయ్యాడు. ప్రేమవల్లకూడా బాగుపడే వాళ్లుంటారు

## 10. ప్రకీర్ణకాలు ;

పై ఎందులోనూ చేరనవి ప్రకీర్ణకాలుగా తీసుకోవడం జరిగింది. వీటిలో ఒక సాధారణ సంఘటన లేదా రచయిత ఒకానొక పరిస్థితిలో పొందిన అనుభూతి మొదలయినవి ఈ కథల్లో చూడవచ్చు.

1 కళ్యాణకింకిణి: ఈ కథ చదవడంవలన పాఠకుడు ఒక మిత్రుని పెళ్ళికివెళ్లిన అనుభూతిని పొందుతాడు.

2 కమ్మతెమ్మెర : కథానాయకుని మధురోహలు.

3 తిరుగు ప్రయాణం : భ్రాంతితో ముందుకు సాగిన 'విశ్వం' అవి ఎండమావులని తిరిగి రావడం అనే సాధారణ సంఘటన.

4 బంగారుపాయ్యి: చెప్పింది చెయ్యమతి చెప్పే చక్కని అదర్శం.

5 గడన : డాబులకే గౌరవం ఉంటుందనే ఆవేదన.

6 జీవితానికి నిర్వచనం : సర్దుబాటు అనే చిన్న సంఘటన.

7 దారితోడు : జీవితంలో అందరితో మంచి సంబంధాలు ఉంచుకోవాలనే సందేశం.

8 అద్వైతం : సర్వమత సమానత్వం,

9 సంస్కారం : చదువు వేరు, సంస్కారం వేరు అనే సందేశం.

10 విధివిధానం : సినిమా ఫక్కీలో జరిగిన సాధారణ సంఘటన.

11 వజ్రాదపి : తృప్తి చాలారకాలు. ఎక్కడికక్కడే తృప్తిపడితే జీవితం సుఖవంతమవుతుందనే సందేశం.

12 ఖాళీఘటా : కలం స్నేహాన్ని విమర్శించే కథ.

ఈ అధ్యాయంలో రాజారాంగారి కథలను దశదిశలుగా కాదుగానీ దశముఖా లుగా పరిశీలించడం జరిగింది. వారి కథానికల్లోని జీవితాన్ని పలు దృక్కోణాల నుంచి అర్థంచేసుకోవడానికి ఆవిష్కరించడానికీ ప్రయత్నం జరిగింది.



# III

# వస్తువు - ఇతివృత్త నిర్మాణం

కథావస్తువునకు వస్తువు, ఇతివృత్తము అనే పదాలు వాడుకలో వున్నాయి ఇతివృత్తాన్ని కథానికా ప్రణాళిక అని. కథానికా పథకమని వ్యవహరిస్తున్నారు వస్తువు, ఇతివృత్తము పర్యాయ పదాలు కావని కార్యకారణ సంబంధముప్న వేరు-వేరు మాటలని విమర్శకులు గుర్తించారు. "సారె మీద కుమ్మరి పెట్టిన మట్టిముద్ద కథావస్తువు. ఆ మట్టి ముద్దనొక ముచ్చటగొలిపె పాత్రగా తీర్చిదిద్దడానికి ఆ కళా-కారుడి చేతిలో భాసించే కల్పనాశిల్పమే ఇతివృత్తం"
అంటూ మట్టికీ, మట్టి పాత్రకూ వుండే భేదమే కథావస్తువుకూ ఇతివృత్తానికీ వుంటుం-దని నిర్వచించారు ఇతివృత్తాన్ని Plot అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా కూడా వాడుతున్నారు "ఒక కార్యకారణ సంబంధంగల కథా సంవిధానమే ప్లాట్."
అని ఖాసింఖాన్ గారు నిర్వచించారు. "వస్తువుకు కొన్ని పరిస్థితులు, నాటకీయ సంఘర్షణ కలిస్తే ఇతివృత్తంగా రూపొందుతుంద"
అని పాల్ గారికో అనే విమర్శకుడు నిరూపించాడు వీటన్నింటినిబట్టి చూస్తే వస్తువు అంటే ముడిసరుకు అన్నమాట.

మానవ సంఘర్షణలు భావోద్వేగాలు, సామరస్య ప్రయత్నాలు మొదలైనవి వస్తువును ఇతివృత్తాలుగా మారుస్తాయి. వస్తువును స్వీకరించి ఒకానొక సత్యావి-ర్భనకు ఉన్ముఖంగా దానిని ఇతివృత్తంగా రూపొందించుకోవడంపైనే కథనుగల మిగి-లిన అంగాలు (శిల్పం వగైరా) ఆధారపడి వుంటాయి. వస్తువుగాని, వస్తు సంబంధ-మైన అనుభూతిగాని ఒక ఎత్తైతే దానిని ఇతరులతో పంచుకోవడం మరో ఎత్తు ఈ రెంటి మధ్య మొదటి దాని నుంచి రెండో కొసదాకా క్రమబద్ధంగా జరిగే కళాత్మ-క ప్రయాణమే ఇతివృత్తం, శిల్పాలుగా ఆవిర్భవించేది.

---

1 "కథానికా దాని స్వరూప స్వభావాలు" — డా॥ పోరంకి దక్షిణామూర్తి సిద్ధాంత వ్యాసం

2 కథానికా రచన — మొహమ్మద్ ఖాసింఖాన్, ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాద్-1944

3 How to write for the Slicks–The wrirers' Book Edited by Helen Hull Banner & Noble Newyork. 1969

ఈ విధంగా క్రమంగా జరిగే ప్రయాణం కథకుని మనసులో రూపురేఖలు దిద్దుకుంటూ వుంటుంది. కొంతకాలం తర్వాత అది కథారూపంలో ఆవిష్కరించ బడుతుంది. ఇదే విషయాన్ని ప్రస్తావిస్తూ ప్రఖ్యాత కథకుడు శ్రీ బుచ్చిబాబు, " ఇతివృత్తం ఊహతో కొంత కాలం తిప్పుకుంటేగాని కథకు స్వరూపం ఏర్పడదు " అంటూ కథకుడు జీవితంలో తాను గమనించిన విషయాలను కుదించి కథగా మార్చు కొని తాను పొందే అనుభూతిని ఇతరులతో పంచుకుంటాడని స్పష్టంచేశారు. 1

"ఏ కథరాసినా మనచుట్టూవున్న లోకాన్ని గురించేకదా! లోకాన్ని చూడ్డం ఒకటి దాన్ని జీర్ణం చేసుకోవడం ఒకటి" అంటూ జీర్ణం చేసుకున్న లోక పరిశీలన నుండే ఇతివృత్తం రూపొందడానికి వీలుందనే అభిప్రాయం వెలిబుచ్చారు ప్రఖ్యాత కథకుడు శ్రీ పాలగుమ్మి పద్మరాజు 2

చాలా మందికి నిత్యం తమ కళ్లముందు జరుగుతున్న సంఘటనలు సామా న్యంగానే తోస్తాయి. ఎంత లోకం తిరిగినా ఖాళీ మనసులే మిగుల్తాయి. కానీ కొందరు ప్రతి సంఘటనలో ఒక విలక్షణతను దర్శిస్తారు ప్రపంచ గమనం; వ్యక్తికి దానితో కుదరని సామరస్యం, రోజురోజుకు పెరుగుతున్న జీవన సంక్లిష్టత, మానవ సంబంధాల్లోని సొంపు వారిని భావకబలితం చేస్తాయి. భావదృష్టి ఏర్పడుతుంది. ఇటువంటి దర్శనం ఫలితంగానే కళారూపాలు ఆవిర్భవిస్తాయి. ఉప్పు, కర్పూరం లాంటి సామాన్య నిత్యనైమిత్తిక ద్రవ్యాల్లోని వైరుధ్యాల్ని తీసుకొని పుణ్య పురుష త్వాన్ని నిరూపించినట్లుగా సామాన్య సంఘటనలనుండే కథకుడు జీవన సత్యాలను పిండుతాడు అయితే ఇది ముడిసరుకు ఇందులో స్వీకరణ యోగ్యమైనంతవరకు మాత్రమే గ్రహించి కథగా మలుచుకోవడానికి కథకునికి శిల్పనైపుణ్యం కావాలెను. "జీవితమనేది బంగారు నిక్షేపంలాంటిదైతే అందులో కావలసినంతమాత్రమే స్వీకరించి అందంగా రూపొందించుకొనే ఆభరణం లాంటిది కథ. ఇందులో కావలసినంత మాత్రమే అన్నది వస్తువు. అందంగా రూపొందించుకోవడమన్నది శిల్పం" అన్న రాజారాంగారి మాటలు దీనిని బలపరుస్తాయి. 3

---

1 కథా దాని కమామీషు (వ్యాసాలు) నన్ను మార్చిన పుస్తకం
— ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ-2 బుచ్చిబాబు

2 తెలుగు కథారచయితలు — పాలగుమ్మి పద్మరాజు,
కొండముది శ్రీరామచంద్రమూర్తి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి-1982

3 మధురాంతకం రాజారాం కథనరంగం

తొలి తెలుగు కథానిక (1919) నుండి ఈనాటి వరకు తెలుగు కథానికా సాహిత్యంలో శ్రామిక విప్లవప్రభావంతో ఆర్థిక సామాజిక ఇతివృత్తాలను జోడించిన కథలతోపాటు మనోవైజ్ఞానికేతి వృత్తాల కథలు (Scien}ific fiction) స్త్రీ, పురుష సంబంధాలు ఇతివృత్తాలుగా గల కథలు విస్తృతంగా వచ్చాయి. వీటితోపాటు అడుగు వర్గాల, బడుగు జీవితాలనుండి అగర్భ శ్రీమంతుని జీవితంవరకు ఎన్ని రకాల మను షులు, ఎన్నిరకాల ప్రవృత్తులు, ఎన్నిరకాల సమస్యలు, సంఘర్షణలు, అసంతృప్తులు ఆరాటాలు ఎదురవుతూ వుంటాయో అన్నింటిని కథావస్తువులుగా స్వీకరించి అద్భుత మయిన కథలుగా మలిచారు తెలుగు కథారచయితలు.

ఈ విధంగా లోకములోని వివిధ అంశాలను పలుకోణాల నుండి చూచి స్పందించి అందమైన కథలుగా రూపొందించిన తెలుగు కథకులలో శ్రీ మధురాంతకం రాజారాం ఎన్నదగినవారు.

ఇతివృత్తం దృష్టితో చూస్తే రాజారాంగారి కథలు తెలుగు వాతావరణం గడపదాటి కాలు బయట పెట్టకపోవచ్చు. రాయలసీమ జన జీవితంతోనే ముడిపె ట్టుకొని వుండవచ్చు. ప్రధానంగా చిత్తూరు జిల్లాకే పరిమితమై సొంతింటి రక్తస్పం దనే ధ్వనిస్తుండవచ్చు. అయితే, ఈ ఆవరణలన్నీ పైకి కనిపించేవేగాని ఆయన కథ లన్నిటిలో ప్రాక్తన మానవీయదృష్టి అనుస్యూతంగా కనిపిస్తుంది. శ్రీ రాజారాం తమ కథావస్తువులను అందరివలెనే తమ సన్నిహిత జీవితం నుండి గ్రహించారు.

ఉపాధ్యాయుల జీవిత సమస్యలను కథావస్తువులుగా తీసుకున్నా, సాంఘీ క సమస్యలను ఇతివృత్తాలుగా స్వీకరించినా పాలనా యంత్రాంగపు అవినీతిని బహి ర్గతం చేయబూనుకున్నా వాటిల్లో సెంటిమెంటును దర్శించకుండా ఉండలేకపోవడమే ఆయన ఇతివృత్తాలకు ప్రత్యేకతను సంతరించి పెడుతుంది. చూచినదానితో, చెప్పు న్న దానితో మమేకం అయ్యే అనివార్య స్పందన ఉండటం వలననే రాజారాంగారి కథల్లో ఆత్మీయత, ఆర్ద్రత దర్శనమిస్తాయి. బ్రతుకుతెరువు కోసం మానవుడు పరిసరాల తోను, పరిస్థితులతోను తీవ్రంగా ఘర్షణ పడుతున్న జీవిత సత్యాలను విస్మరించకుం డానే జీవితంలోని కఠిన వాస్తవాలనూ, కష్టాలనూ తేలికగా తీసికునే విచిత్ర నైపుణ్యా న్ని కూడా రాజారాంగారి కథల్లో చూస్తాం.

వస్తు పరంగా చూస్తే రాజారాం గారి కథల్ని స్థూలంగా ఐదు వర్గాలుగా చేయువచ్చు.

1) ఉపాధ్యాయుల (వ్యక్తిగత, ఔద్యోగిక) జీవిత సమస్యలు

2) పాలనా యంత్రాంగంలోని లోపుగులు
3) మానసిక బాధ్యాలు
4) సాహిత్య విలువలు
5) సాంఘికాలు

మచ్చుకు కొన్ని :—

# ఉపాధ్యాయుల కధలు

తాను వెలిగించిన దీపాలు : రిటైర్డ్ ఉపాధ్యాయుడు కృష్ణశర్మ తాను ముప్పై యైదు సంవత్సరాలు పనిచేసిన రంగ సముద్రం పాఠశాల మీది అభిమానంతో, నిస్సహాయ పరిస్థితుల్లో, మనవరాలి పెళ్లికోసం ఏదైనా సహాయం లభిస్తుందని ఆశించి రంగ సముద్రం వస్తాడు. కానీ అక్కడి పరిస్థితులు చాల మారిపోయి వుంటాయి. ఎలిమెంటరీ స్కూలు కాస్తా హైస్కూలయింది అక్కడి ఉపాధ్యాయులందరూ కొత్తవారు. పాత పరిచయస్తులెవ్వరూ లేరు. అక్కడి వారికి కృష్ణశర్మ యాచకుడివలె కనిపిస్తాడు. ఆత్మాభిమానం దెబ్బతిన్న శర్మ ఊళ్లోకికూడా వెళ్లకుండా రైలెక్కి తిరుగు ప్రయాణమవుతాడు. రైల్లో టిక్కెట్టుతో సహా సంచీ డబ్బులు దొంగలు దోచుకుంటారు రైల్వేవాళ్ళు తుమ్మలకొన అనే అడవి ప్రాంతంలోని స్టేషన్‌లో దింపేస్తారు. అయితే. అక్కడి స్టేషన్‌మాస్టరు శర్మగారి పూర్వవిద్యార్థి కావటం వలన అనుకోని గౌరవాదరాలు శర్మ గారికి లభిస్తాయక్కడ.

విద్యార్థులకోసంపడిన శ్రమ వృధాకాదు విద్యార్థుల హృదయాల్లో ఉపాధ్యాయుడు స్థిరంగా నిల్చి పోతాడనే సత్యం గ్రహించిన కృష్ణశర్మ తన మనవరాలి పెళ్ళి ప్రయత్నం మానుకొని, ఆమెను ఉపాధ్యాయినిగా పిల్లల మధ్య పవిత్రమైన జీవితం గడపమని చెప్పడంతో కథ ముగుస్తుంది.

ఈ కథలో కృష్ణశర్మగారి పూర్వస్మృతులు అనేది కథావస్తువు. కృష్ణశర్మకు ఈ పాఠశాలలో పూర్వ పరిచయస్థులు లేకపోవడం కొత్త వారి ప్రవర్తన తనను యాచక స్థాయికి దిగజార్చడం వంటి వాటితో శర్మగారికి కలిగిన ఆవేదన వీటన్నింటిని మించి మూడున్నర దశాబ్దాల జీవితాన్ని ఈ పాఠశాలకు ధారపోసిన ఉపాధ్యాయుడు ఇప్పుడదే పాఠశాలకు అనామకుడు; అపరిచితుడు; పైగా యాచకప్రాయుడు కూడా. అన్న ఈ భావన శర్మగారిని విచలితున్ని చేస్తున్నది. ఇక్కడి చెట్లకు ఈ పాఠశాల భవనానికే నోరుంటే అవి ఇప్పుడెంత ఆప్యాయంగా పలుకరించేవి? అనే ఆలోచన; ఇది తాను పూలమ్మినచోటు ఇక్కడ కట్టెలమ్మరాదనే నిశ్చయం మొదలగు శర్మగారి ఉద్వేగ పూరితమైన ఆలోచనలు ఈకథా వస్తువును అర్థవంతమైన ఇతివృత్తంగా రూపొందించాయి.

గోరుచుట్టుమీద రోకటిపోటు పలె రైల్లో టిక్కెట్టు పోగొట్టుకోవటం తుమ్మలకోన స్టేషన్లో రైల్వే వాళ్ళు దింపి వేయటం వంటి అవమానకర నిస్సహాయ పరిస్థితుల్లో అక్కడి స్టేషన్ మాస్టర్ తన పూర్వ విద్యార్థి కావటంతో రంగ సముద్రంలో దొరకని గౌరవాదరాలు కృష్ణశర్మకు ఇక్కడ లభించి ఉక్కిరిబిక్కిరి చేసే మధురానుభూతి ఇతివృత్తానికి బలాన్ని చేకూర్చాయి.

ఉపాధ్యాయుడు విద్యార్థుల హృదయాల్లో స్థిరంగా నిలచి పోతాడనే సత్యం కథ చివర్లో ప్రతి పాదించడం ద్వారా ఉపాధ్యాయ వృత్తి గొప్పది అనే భావన పాఠకునికి కలిగించడంలో రచయిత కృతకృత్యుడయినాడు.

<u>అడ్డుదారి</u> :— సాంబశివం మాస్టారు చాలా నిజాయితి పరుడు ఉత్తమ ఉపాధ్యాయుడు అతని భార్య పార్వతమ్మ అమాయకురాలు లోకభీతి, పాపభీతి వున్న భోళామనిషి వారికి ఒక్కడే కొడుకు శంకరం

ఒకనాడు సాంబశివం మాస్టారికి ఎస్. ఎల్ సి పేపర్లు దిద్దటానికి ఇచ్చారు. (1958 వరకు ఎస్. ఎల్ సి పేపర్లు టీచర్లు ఇంట్లోనే దిద్దేవారు. స్పాట్ లేదు) అయన వాటిని జాగ్రత్తగా బీరువాలో దాచారు. మరునాడు విశాఖపట్నం నుండి ఒక అబ్బాయి వచ్చి తాను ఎస్. ఎల్ సి లో ఇంగ్లీషు తప్పుతానని, మార్కులు కలుపమని కళ్ల నీళ్ల పర్యతమై అర్థిస్తాడు. సాంబశివం మాస్టారు కఠినంగా మందలించి వెళ్లగొడతాడు. ఈ సంఘటన పార్వతమ్మకు నచ్చదు. ఆమెకు ఆ అబ్బాయంటే జాలి యేర్పడుతుంది. ఎప్పుడూ అతన్ని గురించి మాట్లాడుతూ వుంటుంది.

శంకరానికి విశాఖపట్నంలో ఉద్యోగం వస్తే అక్కడ ఆ అబ్బాయి కనబడతాడు. అసలు అతనికి చదువేరాదు. విద్యార్థుల వద్దనుండి డబ్బులు వసూలు చేసుకొని మాస్టార్లతో మార్కులు వేయించడం అతని వృత్తి అని తెలుస్తుంది. తెల్ల బోవడం పార్వతమ్మ వంతవుతుంది కథ ముగుస్తుంది.

సాంబశివం మాస్టారు నిజాయితీ చుట్టూ అల్లబడిన ఈ కథ చివరి మలుపులో అతని నిజాయితీని మరింత ప్రకాశింప జేస్తూముగుస్తుంది. ఏది లేక పోతే తనకు బతుకు లేదో దాన్ని శ్రద్ధగా, లోప రహితంగా చేయాలనే వృత్తి ధర్మం పై భక్తి శ్రద్ధలు గల సాంబశివం మాస్టారి భావాలు, దేని కోసమైతే భయపడి లాభం లేదో దాని కోసమే భయపడే అమాయకురాలు పార్వతమ్మ పాపభీతి, తద్వార తమకు ఏదైనా కీడు జరుగు తుందేమో అనుకునే పార్వతమ్మ భోళామనస్సు, అక్రమంగా మార్కులు సంపాదించు కోవడానికి వచ్చిన "అక్రమార్కుడి" ముందు పార్వతమ్మ అమాయకత్వం, సాంబశివం గారి నిజాయితీ వెనుక నున్న కోపం మొదలగు సంఘర్షణలు ఈ కథా వస్తువుకు ఇతివృతంగా సమకూరాయి.

సాంబశివం మాస్టారు అక్రమంగా మార్కులు వేయక పోవడం అతని నిజాయితీకి నిదర్శనం. చివరికి మార్కులు సంపాదించటానికి వచ్చిన అబ్బాయికి చదువే రాదని, ఇది అతని వృత్తి అని, తెలియడం ద్వారా ఉపాధ్యాయుల నిజాయితీని నిరూపించి ఇటు వంటి వృత్తులు గల బ్రోకర్లు వుంటారనే నిజాన్ని ఈ కథ ద్వారా రచయిత తెలిపారు.

పాలనా యంత్రాంగములోని లొసుగులు :

పతి దేవుళ్లూ-ఆడకూతుళ్లూ:- గురుమూర్తి ఉపాధ్యాయుడు అయనకు నలుగురు కొడుకులు; ఒకకూతురు. పేదరికంతో గడుపుతున్నాడు. నలుగురు కొడుకులను చదివించాడు. వాళ్ళు దేశం నలుమూలల్లో ఉన్నతోద్యోగాల్లో వున్నారు. వాళ్ళకు తల్లి దండ్రులుచెల్లెలిని గురించి ఆలోచించే తీరిక లేదు. భార్యా అనారోగ్యమని కారణం చెప్పి డాక్టర్ సర్టిఫికెటు తో లోను, కూతురు పెళ్ళి అని శుభలేఖ జతచేసి మరో లోను, ఈ విధంగా ప్రావిడెంట్ ఫండు నుండి తీసుకొని ఇది వరకే కొడుకుల చదువులకు ఉపయోగించాడు. కాని చివరికి కూతురు సుజాత పెళ్ళికి ఏ కొడుకు సహాయం చేయ లేదు. ఉన్న యింటిని తెగనమ్మి సుజాత పెళ్ళి జరిపించాడు. అల్లుడు రమణ మూర్తి మంచి వాడే కాని ఒకనాడు రమణ మూర్తి అలిగి చెప్పా చేయకుండా వెళ్ళి పోతాడు. కారణం ఎవరికీ బోధ పడదు. గురుమూర్తి పట్నం వెళ్ళి రమణ మూర్తి ఆఫీసులో. ఇంట్లో అతన్ని కలుసుకోవడానికి ప్రయత్నిస్తాడు. కానీ. గురుమూర్తికి ఆ అవకాశాన్ని కలించడు రమణ మూర్తి. ఇక దాదాపు సంబంధాలన్నీ తెగినట్టే అనుకుంటారు ఈ వృద్ధ దంపతులు లోలోపల్నే కుమిలి పోతూవుండడం చూచి సహించని సుజాత భర్తను వెతుక్కుంటూ పట్నం వెళ్లుతుంది. భర్తను నిలదీసి "తప్పేమిటి?" అని అడుగు తుంది. తన వలన తన తల్లిదండ్రులు బాధపడడం సహించలేక వచ్చానంటుంది.

చివరికి తేలిన విషయం చాలామామూలిది కూతురు మ్యారేజ్‌లోన్ కోసం అప్లయి చేసినప్పుడు దానికి జతచేసిన శుభలేఖను చూచి సుజాతకు ఇంతకు ముందే వివాహ మయి పోయిందను కొంటాడు రమణమూర్తి కానీ, అది కేవలం ప్రభుత్వ యంత్రాంగం కోసం తయారు చేసిందేనని తెలిసి అనుమానాలు, అపోహలు అన్నీ మంచులా విడి పోతాయి. రమణ మూర్తి మామ గారికి క్షమాపణ రాస్తాడన్న సూచనతో కథ ముగుస్తుంది.

ప్రభుత్వ యంత్రాంగంలో మ్యారేజి లోను, భార్య అనారోగ్యమని డాక్టరు సర్టిఫికేటుతో తీసుకునే లోను మొదలగు పద్ధతులను వస్తువుగా తీసుకుని దాని వల్ల గురుమూర్తి కుటుంబంలో చెలరేగిన వాతావరణం సుజాత కాపురం చెడిపోవడం దాంతో గురుమూర్తి దంపతులకు కలిగిన తీవ్రమనస్తాపం, సుజాత అత్తవారింటికి ఎందుకు వెళ్ళడం లేదని చుట్టు ప్రక్కల వారందరు నిలదీయడం వలన సుజాత మనో వేదన మొదలగు వాటితో మంచి ఇతివృత్తం ఏర్పడింది

ప్రభుత్వ యంత్రాంగంలో వున్న ఈ లొసుగు వలన కూతుళ్లు లేని వారు కూడ ఏదో శుభలేఖ ప్రచురించి డబ్బు తీసుకోవచ్చు.

భార్యకు ఆరోగ్యంగానే వున్నా డాక్టర్ సర్టిఫికేటుతో డబ్బు తీసుకోవచ్చు. ఇవన్నీ జరుగుతుండగా సుజాతలాంటి కొందరమ్మాయిల జీవితాలలో అప్పుడప్పుడు ఇటువంటి అపార్థాలకు దారి తీసే సంఘటనలు జరుగవచ్చని తెలిపే ఇతివృత్తం ఈ కథలో వుంది

మానసిక జాడ్యాలు :

<u>పురుషులకు ప్రత్యేకం :-</u> ఈకథలో రచయిత రాజశేఖరం పేరుతో బాబాయి కూతురు శారద కథ ఉత్తమ పురుషలో చెప్తాడు. బాబాయి ఉపాధ్యాయుడు ఐదుగురు ఆడపిల్లల తండ్రి పెద్ద కూతురు శారద B A చదివింది. కట్నాలలిచ్చే తాహతులేదు. అందుకె కట్నం ఆశించకుండా వచ్చిన నరహరితో శారద పెళ్లి జరుతారు నరహరి పెద్దగా చదువు కోలేదు ఏదో టెక్నికల్ చదువుతో ఉద్యోగంచేస్తున్నాడు అతనికి చదువు వున్న స్త్రీ అంటే ఒక రకమైన కసి అందుకే శారదను ఎప్పుడూ హింసిస్తూవుంటాడు. నరహరి బావ కోదండం ఎగదోసే మనిషి అతడు భార్యకు భయపడతాడు కనుక నరహరి భార్యను హింసిస్తుంటె చూడడం కోదండానికి సరదా. ఈ శాడిస్టుల మధ్య శారద నలిగి పోయింది. ప్రత్యక్ష నరకం అనుభవించి విడాకులతో శాశ్వతంగా విముక్తి పొందింది తర్వాత B. Ed. చేసి ఉపాధ్యాయినిగా స్థిరపడి, లెక్చరర్‌ను ప్రేమించి పెళ్ళిచేసుకొని M. A చేసి తాను లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తుంది

చాలా రోజుల తర్వాత నరహరి రాజశేఖరానికి కనబడతాడు. ఇప్పుడున్న నరహరి భార్య భార్య కాదు. నరహరే ఆమెకు భార్య. ఆవిడంటె నరహరి అంత భయపడతాడు. అదిగాక ఆమె పూర్వాశ్రమంలో ఒక వేశ్య అని తెలియడంతో కథ ముగుస్తుంది.

శాడిజంను కథా వస్తువుగా తీసుకొని కథచుట్టూబడిపంతులయిన బాబాయి జీవిత సమస్యలు, ఆడ పిల్లల పెళ్ళిళ్లు, వారి చదువులు, అతి గారాబంగా పెంచుకున్న అమ్మాయిని రాక్షసుడి వంటి భర్తకు కట్ట బెట్టినాననే పరివేదన, భర్త పెట్టే బాధలు చాలావన్నట్టు కోదండం నరహరిని మరింత రెచ్చ గొట్టడం, ఆడ పడచు రాజమ్మ C. I. D గా వ్యవహరించడం. ఇవన్నీ శారద సున్నిత మనస్తత్వానికి తగిలిన గాయాలు. ఆడ పిల్లలు అత్తింట్లో పడే బాధలు, చివరికి విడాకుల వరకుల జరిగిన సన్నివేశాలన్నీ నరహరి మానసిక జాడ్యం అనే చక్కటి ఇతివృత్తంగా మార్చాయి.

ఇంతవరకు ఫ్లాష్-బ్యాక్‌లో జరిగిన కథ నరహరి ప్రస్తుత కథతో ముడిపడి అతని పరిస్థితి దయనీయంగా మారడంతో ముగుస్తుంది. అయితే తన పరిస్థితిని కప్పి పుచ్చు

కోవడానికి నరహరి చేసిన ప్రయత్నాల వలన అతనిలో అంతర్గతంగా వున్న కాంప్లెక్స్ నశించలేదని తెలుస్తుంది. ఏటొచ్చీ దాన్ని ప్రదర్శించడానికి శారద వంటి అమాయకులు మాత్రం దొరకలేదు. నరహరి ఎంత శాంస్టయినా అనుకూల పరిస్థితుల్లోనే శాడిజాన్ని ప్రదర్శించగలడనే సత్యాన్ని రచయిత చెప్పక చెప్తాడు.

కామదహనం :- చలపతి చాలా బుద్ధిమంతుడు సంఘంలో మంచివాడుగా చలామణి అవుతున్నాడు. ఆడపిల్లలకు చాలాదూరంగా వుంటాడు కానీ అతని ఈ ఊహ లోకంలో బూతు ప్రపంచాన్ని సృష్టించుకొని ఆనందిస్తుంటాడు. ఈ ఊహాలోక విహారాన్ని కథల రూపంలో కామవర్ధని పేరుతో శృంగార పత్రికల్లో ప్రచురిస్తువుంటాడు ఈ రంగంలో అతడు మంచి కథకుడు అన్న పేరు గూడ వస్తుంది. ఈ విషయాలన్నీ చాలా రహస్యంగా వుంటాయి ఒక్క మిత్రుడు అనగా శేఖరంబాబుకు ఈ విషయం తెలుసు. కానీ, చలపతి శేఖరానికేమీ తెలియదను కుంటాడు.

చలపతి పెళ్ళి అవుతుంది. బీరువాలో వున్న తన సాహిత్యాన్ని భార్య చూచి, అసహ్యపడి మౌనంగా ఆసాహిత్యాన్నంతా బాయిలర్‌లో వేసి కాల్చి ఆ నీళ్లతో చలపతికి స్నానం చేయిస్తుంది. అనాటితో కామదహనం అయిపోయింది. మళ్ళీ చలపతి బూతు కథలు రాయలేదు. రాయాలనుకోలేదు కూడాను.

చలపతి పైకి అమాయకుడుగా కనిపించినా అతనిలో కామవర్ధన్ దాగివు న్నాడు. ఒక రకంగా చలపతితో ప్రమాదమేమీ లేదు. అతని అంతరంగంలో చెల రేగే భావాల ప్రతిరూపమె బూతు కథాసాహిత్యం అది సంఘానికి తెలియకూడదనే భావం. ఇవన్నీ చలపతి పబ్లికేషన్ యాక్టివిటీకి ఇతివృత్తంగా మారాయి చివరికి కామదహనమనేది ముగింపు. అయినా రహస్యం బహిర్గతమైన తర్వాత దానిని గురిం చిన ఆలోచనలు ఉండవనీ, పెళ్లిఅయిన తర్వాత చలపతి బూతు కథలు రాయకపోవ డానికి కారణం అదే. దానికి కామదహనం చక్కని ముగింపు అయింది.

సాహిత్య విలువలు :-

భూమార్గం:- "విజయరాణి" అనే పత్రికవాళ్లు నాలుగు రకాల దృక్ఫ థాలుగల నలుగురు ప్రముఖ రచయితలతో గొలుసు నవల రాయించాలనుకుంటారు నాలుగో రచయిత ప్రస్తుత కథా రచయిత

మొదటి రచయిత ఈ కథను బొంబాయి పట్టణంలోని ఒక ప్రముఖ పంచ నక్షత్రాల హొటల్లో ప్రారంభిస్తాడు కథలో నాయకుడు జీవన్, నాయిక లీలాకిరణ్ అయిదారు వారాల్లో కథను ఒక ఎడారిలాంటి వాతావరణంలో వదిలివేస్తాడు. రెండో

రచయిత దాని చుట్టూ సంఘటనలు సన్నివేశాలు కల్పించి కథను కాస్తా సాగదీస్తాడు. ఇక మూడో రచయిత కథను ఎలా మలుస్తాడో తెలియని ఈ కథారచయిత ఆ రచయితను కలిసి ఆకాశాయనం చేస్తున్న ఆ గొలుసు కథను కాస్తా భూమార్గం పట్టించమంటాడు మూడో రచయిత భూమార్గం పట్టించిన కథను సుఖాంతం చేస్తాడీ నాలుగో రచయిత.

వాస్తవిక తెలుగు వాతావరణాన్ని వదిలి ఆకాశాయనం చేస్తున్న తెలుగు రచనలను, ధోరణులను కథావస్తువుగా తీసుకొని కథను తెలుగు వాతావరణం లోనే నడపాలి కాని బొంబాయివంటి పట్టణాలలో కాదని, కథా నాయికా-నాయకుల పేర్లు తెలుగు తనంతో కూడుకొని వుండాలని, కథలో వాస్తవిక చిత్రీకరణ వుండాలని, సంఘటనలు సహజంగా వుండాలని ఈ కథారచయిత పడిన ఆవేదన, ఆరాటాలే ఈ కథా వస్తువుకు ఇతివృత్తమయినాయి.

వాతావరణ చిత్రీకరణ సన్నివేశ చిత్రీకరణ, సహజంగా వుండాలని తెల్గు వాతావరణంలోనే కథలు సాగాలని వీలయినంత మట్టుకు గ్రామగతమైన వాతావరణమే వుండాలని, పేర్లు తెల్గు సంప్రదాయాలకు ప్రతీకలుగా వుండాలని రచయిత వెలువరించిన అభిప్రాయాలే ఈ కథ ఇతివృత్తాన్ని మలిచాయి.

**ధర్మగ్లాని** :– వ్యాసమూర్తి అనే రచయిత ఒక వూళ్లో ఉపన్యాసం చెయ్యడానికి వెళ్లినప్పుడు రాధాపతి అనే యువకుడు తాను వ్యాసమూర్తి అభిమాన పాఠకున్నని పరిచయం చేసుకుంటాడు. రాధాపతిగూడ రచనలు చేస్తుంటాడు. అయితే అందులో సాహిత్య విలువలుండవు. అందులో ఎన్ని మార్పులు సూచిస్తాడు వ్యాసమూర్తి. కాని రాధాపతి వినకుండా తన రచనలను యథాతథంగా అచ్చు వేయిస్తాడు అవన్నీ వేడివేడి పకోడీల్లా అమ్ముడు పోతాయి.

సాహిత్య విలువలు పడిపోతున్నాయని, సమాజంలో సాహిత్యం మూడో తరగతి పాఠకున్ని ఆకట్టుకోవటానికి ప్రయత్నిస్తుందనీ, సాహిత్యం వ్యాపార పంకిలమవుతున్నదని బాధపడుతూ వ్యాసమూర్తి రాధాపతికి ఒక వుత్తరం రాస్తాడు. ఆ వుత్తరమే ఈ కథ.

పడిపోతున్న సాహిత్య విలువలను కథా వస్తువుగా తీసుకుని సాహిత్యం సమాజాన్ని ప్రతిబింబించడం లేదని, ప్రజాశ్రేయస్సును పట్టించుకోవడం లేదని ఈ రెండు విలువలు లేకుండా సాహిత్యం కేవలం మూడో తరగతి పాఠకునికై ఉద్దేశించబడిందిగా మారిందని వ్యాసమూర్తి అనే రచయిత పడే ఆవేదన, ఆరాటాలే ఈ కథా

వస్తువును ఇతివృత్తమయినది. రాఘాపతికి సాహిత్య విలువలను గురించి చెప్పడం, రాఘాపతి రచనల్లోని లోపాలను ఎత్తిచూపడం, చివరికి రాసిన ప్రత్యుత్తరంలో మార్గనిర్దేశం చేసే రెక్కమాను (సిగ్నల్) వంటి సాహిత్యం వాతావరణ మార్పులవలన కూలిపోతే దాన్ని తిప్పి నాటడం జరిగిందని, దాన్ననుసరించి వెళ్లే ప్రజలకు కీకారణ్యాలు, లోయలు, క్రూర మృగాలు తప్ప మరేమి లభించవని సూచించడం ఇతివృత్తానికి బలాన్ని చేకూర్చుతున్నాయి.

సాహిత్యాన్ని తిప్పినాటిన రెక్కమానుతో పోల్చడం; మార్గనిర్దేశంచేసే సాహిత్యం పక్కదారి పట్టిస్తుందనే ఆవేదన. 'తమసోమా జ్యోతిర్గమయ' అనే మాటకు అర్థం లేకుండా పోతుందనే బాధ; అయితే ప్రజ ఈ రెక్కమానునే ఎందుకు గుడ్డిగా నమ్మిందనే ప్రశ్నతో కథ ముగుస్తుంది. కథన పరంగా వస్తువు ఏమీ లేకున్నా రేఖా ప్రక్రియనెన్నుకోవడంతో ఇతివృత్తం రూపొందింది.

సాంఘికాలు :—

**అనామకుడు :—** జగన్నాథం గారనే లక్షాధికారి తమ ఏకైక పుత్రిక ప్రసూన పెళ్ళి కామాక్షి కళ్యాణమండపంలో ఆర్భాటంగా జరుపుతున్నాడు. వరుడు సీతాపతి ఎమ్మెస్సీ చేసాడు.

పెళ్లికి చాలామంది వస్తారు. జగన్నాథంగారు లక్షాధికారి కావడం, అందులో అతని ఏకైక పుత్రిక పెళ్లి చేయడం, ఈ రెండూ దానికి కారణాలు. అయితే వచ్చిన వారిలో అసలు బంధువులెవరో, దొంగలెవరో తెలియని పరిస్థితి ఎదురయింది. ఈ విషయంలో అనుమానన్ని రేకెత్తించింది హనుమంతప్ప. అప్పటి నుండి జగన్నాథంగారికి ప్రతివాడూ దొంగగానే కనిపిస్తాడు. ఒక వ్యక్తిమీద అనుమానం దాదాపు ధృడపడుతుంది. ఆ పల్లెటూరి వ్యక్తే దొంగనుకుంటాడు, కాని చివరకు ఆ అనామకుడు తన వియ్యంకుడని తెలుస్తుంది. ఆపాటికి ఆ వ్యక్తి వెళ్లిపోతాడు.

పల్లెటూరి తలి-దండ్రులు రెక్కలు ముక్కలు చేసుకుని పట్నంలో కొడుకును చదివిస్తే తలి-దండ్రులను మరిచిన ఆ కొడుకు ధనవంతుల కూతుర్ని చేసుకునే పెళ్ళిలో పెళ్ళికొడుకు తండ్రి అనామకుడు అపరిచితుడు అవుతాడు. సంఘములో మామూలుగా జరుగుతున్న సంఘటన యిది.

ఉన్నత విద్యకోసం పట్నవాసం చేయటానికి వచ్చే గ్రామీణ యువకుల 'అర్బన్ మెంటాలిటీ'ని కథావస్తువుగా తీసుకొని తద్వారా శుష్కమయ్యే బంధుప్రీతి,

ఆప్యాయతలు అనురాగాలు. రక్తసంబంధాలు తనవారు అనాగరికులుగా కనిపించడం పట్టణంలోవున్న కృత్రిమ వాతావరణానికి భ్రమసిపోయి తమను తాము మరిచిపోవడం దానివల్ల తల్లిదండ్రుల హృదయాల్లో చెలరేగే ఆవేదన మొదలయినవన్నీ ఈ ఇతివృత్తంచుట్టూ అల్లుకున్నవి. దానితో పాటు బాగా చదువుకున్న అబ్బాయిని గాలంవేసి, తలి-దండ్రులకు దూరంచేసి 'ఫ్రం అడ్రస్' లేని పార్శిల్ పెట్టెల్లాగా రెడిమేడ్ అల్లుళ్ల ను సంపాదించటం పట్నంలోని ధనవంతులకు వెన్నతోపెట్టిన విద్య అని ఈ కథవలన తెలుస్తున్నది.

ఈ సంఘం ఇదే విధంగా వుంటుందని; ఏదేమైనా కాలం ఆగదనడానికి ప్రతీకగా కథాంతంలో మరోపెళ్లివారు వస్తున్నారు కనుక కళ్యాణ మహల్‌ను శుభ్రపరుస్తా న్నారనడంతో కథ ముగుస్తుంది

**కన్నెచెర** :— ఈ సంఘలో ఆడపిల్లల తండ్రికి మాత్రమే కష్టాలుంటాయని మగపిల్లల తండ్రికి వుండవని ఒక అపోహ వున్నది.

ఉన్న ఆస్తంతా తనఖాపెట్టి కొడుకు చదువు కోసం పట్నంలో కాపురం పెత తాడు సుందర్రామయ్య. కొడుకు చదువయి పోయినా ఎంతకూ ఉద్యోగంరాదు.

రూపం, గుణం. సౌశీల్యం కలిగిన కూతురు వైదేహికి కట్నమిచ్చి పెళ్లిచేయలేని గుమస్తా వెంకట్రావు. వీళ్లిద్దరూ రోజూ పార్కులో ఒకే బెంచిమీద కూర్చొని ఒకరితో ఒకరు తమ కష్ట-సుఖాలు చెప్పుకుంటూ వుంటారు

సుందర్రామయ్య వెంకట్రావు కూతుర్ని కట్నం లేకుండా కోడల్ని చేసుకోవాలనుకుంటాడు. కాని మగపెళ్లివారమనే భేషజంతో నోరు విప్పడు.

సుందర్రామయ్య కొడుకు కృష్ణమూర్తి ఒక ఇంటర్వ్యూకోసం హైదాబాద్ కు వెల్లి ఒక మిత్రుని సహాయంతో ఉద్యోగం సంపాదించుకుని ఆ మిత్రుని చెల్లెలినే వివాహం చేసుకుంటాడు. కాని సుందర్రామయ్య కొడుకు వెంకట్రావు కొడుకే అని, వెంకట్రావు కూతుర్నే కృష్ణమూర్తి వివాహం చేసుకుంటున్నాడని వీరిద్దరికి చివరివరకు తెలియదు.

ఆడపిల్ల కన్నెచెర వదిలించడం ఎంతకష్టమో మగపిల్లల చదువులు ఉద్యోగాలు అంతే కష్టమనే వస్తువుకు సుందర్రామయ్య పొందే ఆవేదన. సుందర్రామయ్య భార్య నీటిపంపు దగ్గరికి నీటితోపాటు కన్నీరును కూడా నింపుకురావడం, సానుభూతితో వ్యంగ్యమో, అర్థంగాని రీతిలో తాము నేర్చిన జాతీయాలు, సామెతలు వీరిమీదే ప్రయోగించే సంఘదృష్టి - సుందర్రామయ్య వెంకట్రావు వారి భార్యలు సమానంగా అనుభవిస్తున్న ఆర్తీ, ఆవేదనా. ఆరాటమూ ఇతివృత్తమయినాయి.

# IV

# పాత్ర చిత్రణా శిల్పం
# కొన్ని విశిష్ట పాత్రలు

ఒక రచనలో తన స్వాభావిక లక్షణాలను మాటల్లో గాని, చేతల్లో గాని వ్యక్తంచేసే వ్యక్తిని "పాత్ర" (Charector) అని అంటారని శ్రీ పోరంకి దక్షిణామూర్తి తమ సిద్ధాంతగ్రంథం "తెలుగు కథానిక స్వరూప స్వభావాలు" లో పేర్కొన్నారు. వ్యక్తి మాటలు, చేతలకు ప్రేరణ ఇచ్చేది అతని వ్యక్తిత్వమవుతుంది. ఈ పాత్ర కథాది నుండి కథాంతం వరకు ఒకేరకంగా ఉండవచ్చు. కొన్ని పరిస్థితుల్లో మారనూవచ్చు. కాని కథాది నుండి చివరి వరకు ఆ పాత్రశీలంలో ఏకసూత్రత (Consistency) వుండాలని స్పష్టం చేశారు దక్షిణామూర్తిగారు.

కథానిక పాత్రచిత్రణలో రెండు రకాల పద్ధతులు కనిపిస్తున్నాయి.

1 రచయిత పాత్రను చూపించడం
2 పాత్రను గురించి రచయితే చెప్పడం

**రచయిత పాత్రను చూపించడం :—**

కథలో ఒక పాత్ర కార్యకలాపాలను మాత్రమే ప్రదర్శిస్తూ చిత్రించడం ఈ పద్ధతిలోకి వస్తుంది. అంటే రచయిత ఆ పాత్రను గురించి తన మాటలలో ఏమీ వర్ణించడు, వ్యాఖ్యానించడు. ఘటన లేదా ఘటనల క్రమంలో పాత్రల ప్రతిస్పందనలో ప్రవర్తనలో ఒక క్రమం లేదా సంగత్యం కనిపిస్తే అది ఉత్తమ చిత్రణ అనిపించుకుంటుంది. ఇక్కడ రచయిత కేవలం సాక్షిభూతుడుగా మాత్రమే వ్యవహరిస్తాడు.

**పాత్రను గురించి రచయితే చెప్పడం :—**

ఈ పద్ధతిలో రచయిత పాత్రల మాటలను తానే వినిపిస్తాడు. చేతలను ప్రదర్శిస్తాడు. వాటి వెనకాలవున్న మనోప్రపంచాన్ని పాఠకుల ఊహకే వదిలివేస్తాడు. రచయిత కథలో ప్రవేశించడు.

కథానికలో పాత్ర జీవితాన్నంతా ప్రదర్శించడం సాధ్యంకాదు. ఆ పాత్ర ప్రవృత్తిని కొన్ని వర్ణనలద్వారా సూచించి కొన్ని సన్నివేశాలద్వారా ఆ పాత్రలో వచ్చే మార్పును విశ్లేషించడం కనిపిస్తుంది లేదా ఒక సంఘటన కానీ, ఒక సన్నివేశం కానీ సృష్టించి తద్వారా పాత్రలో వచ్చిన మార్పును ప్రకాశమానం చెయ్యడం కనిపిస్తుంది

రాజారాంగారి కథల్లో ఈ రెండు పద్ధతులు కనిపిస్తాయి. సాధారణంగా రచయిత మామయ్యల గురించి. బాబాయిల గురించి చెప్పిన కథలున్నాయి. ఈ కథల్లో రచయిత కథమాత్రం చెప్తూ కథలో నిమిత్తమాత్రంగా జీవిస్తాడు. ఉదా॥ పాంథశాల; షరతులకు ప్రత్యేకం; వైరాగ్యంతో సరాగం; సుడిగుండం; మానవుడి విజయం, ప్రకృతులు మొదలయిన కథలు చూడవచ్చు.

అయితే క్వాచిత్కంగా దానికి అపవాదం కనిపిస్తుంది. కొన్ని కథల్లో తన నిమిత్తమాత్రతకు భంగం కలుగకుండా రచయిత కథలో ప్రవేశిస్తాడు. కథలో ఒక పాత్రగా మారతాడు. ఉదా॥ ఎండమావి: చలిచెలిమ; ట్రంపు చీటి; ప్రజాపతి; ఒంటి: వగపేటికి చల్ల చిందినన్; హాలికులు కుశలమా; వ్యవస్థ; మొదలగు కథలు కనిపిస్తాయి.

రాజారాంగారి కథల్లో ఈ రెండు పద్ధతులతో పాటు రచయిత కథలో తాను ప్రధాన పాత్రగా ఉంటూ మిగతా పాత్రలను ఎత్తిచూపించడం కూడా కనబడుతుంది. ఉదా॥ టి కప్పులో కల్లోలం: దుష్టసమాసం; పిచ్చి వెంకట్రావు; పుత్రోత్సాహం; దివ్యౌషధం: ఎక్కవలసిన రైలు; పొద్దుచాలని మనిషి; మొదలైన కథలు

మొదటి కోవకు చెందిన అనగా రచయిత పాత్రను చూపించడం అనే కోవకు చెందిన కథలు ఈ విధంగా ఉన్నాయి

వృత్తిపై వున్న శ్రద్ధాశక్తుల ముందు అన్నిటినీ తృణీకరించే ఉపాధ్యాయుడు సీతాపతి (అంగరక్షకుడు) నిజాయితీకి మారుపేరు సాంబశివం మేష్టారు (అడ్డుదారి) సంఘంలో మంచి వ్యక్తిగా చలామణి అవుతూ లేకి బుద్ధులు ప్రదర్శించే వెంకట్రావు అరణ్యరోదనం) కుల మత భాషలకు అతీతంగా జీవిస్తున్న టూరిస్టు బస్ డ్రైవర్ గంగూలి (అద్వైతం) చదువుకున్న కొడుకు పెళ్ళిలో అనామకుడైన, పల్లెటూరి వాడైన పెళ్ళికొడుకు తండ్రి (అనామకుడు) నిజాయితీగా బతికి సంఘంచేత పిచ్చివాడని పించుకున్న (అప్పుల నరసయ్య) బ్యూరోక్రాటిక్ అసమానతల్లో నలిగిపోయిన అటెండర్ రమణయ్య (అడిగిరాని వరాలు) అల్లుని అక్రమ సంపాదనకు బాధపడే శివరామయ్య (ఆశయసిద్ధి)ఇంట్లో వస్తులున్నా బయట వంటల గురించి ఉపన్యాసాలుచేసే హరిచెంచయ్య మేష్టారు (ఇంటా బయట) ఉన్నత విద్యలభ్యసించి ఉద్యోగంచేయలేక పోయిన ఎం. ఫిల్ విద్యార్థిని కస్తూరి (ఉద్యోగం) రంగనాథం బాబాయి లౌక్యానికి

ఎదురు తిరిగిన అల్లుడు రఘుపతి (ఎదురుగాలి) తన నారి కోసం సర్వస్వాన్ని ధారబోసి ఎవరికీ ఏమీ కాకుండా ఒంటరిగా మిగిలిపోయిన కామాక్షమ్మ (ఏకాకి) కలవారి కోడలు సుమిత్ర పాపభీతి వెనకదాగిన మానవత్వం (కాటుక కంటనీరు) ఇతరుల జీవితాలను నవ్వులపాలు చేయబోయి తానే కార్టూనయిన రామనాథం (కార్టూన్) జీవితాంతం తిండి కోసం వాచిపోయి చివరికి అన్నిరకాలు దొరికినా తినలేకపోయినసత్తిరాజు (కోరినకోనలో కురనివాన) భార్య స్వాతిశయం వల్ల వ్యాపక లేకుండా పోయిన అంజనేయులు (గాలి పటాలు గాజుదీపాలు) జీవితమంతా ఊరికి ధారబోసినా చివరికి తానే బాకీదారుడిగా తేలిన మణవాళయ్య (గోదారి) తానే జాగరూకున్ని అనుకుంటే తనను తలదన్నే వాడుంటాడని తెలుసుకున్న రామలింగం (జాగరూకుడు) వరదలో బస్సాగిపోతే నిర్లిప్తంగా బస్సుటాపుపైన నిద్రపోయిన వృద్ధుడు (జీవన్ముక్తుడు) విద్యార్థుల హృదయాల్లో స్థిరంగా నిలిచిపోయిన ఉత్తమ ఉపాధ్యాయుడు కృష్ణశర్మ (తాను వెలిగించిన దీపాలు) మానవుడు సంఘజీవి అని మరచిపోయిన కొండలాప్పు(దారితోడు) గ్రామ రాజకీయాల్లో బలిఅయిన అమాయకులు (నోరులేని జీవుడు) రూలు కోసం మ షి కాదని మనిషి కోసం రూలని నమ్మిన హెడ్మాస్టర్ వెంకట్రావు (పిచ్చి వెంకట్రావు) ఆధునికసాహిత్యంలో మానవతా దృక్పథంవెతకడం కంటే పూటకు పట్టెడు మెతుకులు సంపాదించుకోడవం ముఖ్యమనిభావించిన రిసెర్చ్‌స్కాలర్ (ఫలిత ) దగాపడ్డస్త్రీజానకి (మయసభ) అవినీతే ప్రధానంగా బతికిన స్కూల్ ఇన్స్పెక్టర్ ధనరాయులు (మేలు చేసినవాడు) మనుషుల్లో దేవుడున్నాడనడానికి నిదర్శనంగావున్న శంకరం(సాక్షాత్కారం) కళను అమ్ముకోవడం తెలియని ప్రఖ్యాత చిత్రకారుడు భవానీశంకరం (ఆశ్రయం) తాశిల్దారయిన చిన్ననాటి మిత్రుని ముందు కుచించుకుపోయిన సుబ్బరామయ్య (ఒకే కాడ రెండు పువ్వులు)

ఈ విధంగా రాజారాం గారి కధల్లోని పాత్రలన్నీ నిజ జీవితంలో మనకు తటస్థపడే వ్యక్తులే కావడం గమనించవచ్చు అటువంటి వ్యక్తులను స్వీకరించి తమ కథల్లో పాత్రలుగా మలిచి వాటికి ప్రాణప్రతిష్ఠ చేశారు రాజారాం గారు

పై కథలన్నీ రచయిత కథలో పాత్రలను చూపించేవి మాత్రమే. రచయిత పాత్రల గురించి చెప్పే కథలు కింది విధంగా వున్నాయి

స్వార్థపరునితో అనుబంధాలు పెంచుకొని దెబ్బతిన్న సుందరం వడివేలు (ఎండమావి) ఆదర్శాల మోతలో కుంగి పోయిన చలపతి (ఎక్కవలసిన రైలు) మతం మార్చుకొని ఆఫీసరయినా పాత జీవితాన్ని మరిచిపోని అంజిగాడు (చలిచెలమ) నాటకాలవారి జీవితమనే పేకాటలో ట్రంపు కార్డుగా మారిన కనకవల్లి (ట్రంపు కార్డు) తాగుబోతు భర్తను వదిలించుకోలేక సంసారం చెయ్యలేక బతుకును భారంగా మోస్తున్న హెడ్‌మిస్ట్రెస్ విమలాదేవి (దుష్టసమాసం) పైవాడు తనను ఉపయోగించు కుంటున్నాడని తెలిసినా ఎగబాకాలనుకుని పై వర్గం లోకి చేరలేకపోయిన కామేశం

(త్రిశంకుడి స్వర్గం) డబ్బూ, హోదా, పలుకుబడి అన్నీ ఉన్నా సహజమైన ఆప్యాయతలకు నోచుకోక యాంత్రిక జీవితాన్ని గడుపుతున్న రంగనాథం మామయ్య (పాంథశాల) తన విలాసాలకు ఐన అప్పు కోసం సొంత తమ్ముని తాకట్టు పెట్టుకున్న అభినవ ధర్మరాజు సత్తిరాజు (బంధీ) నటి శోభాదేవి వేషం వేసి గ్రామస్తుల ముందు రాజశేఖరం పరువు నిలబెట్టిన మిత్రుడు మధు సూదనం (మిస్ మరీచిక) వక్రమార్గం పట్టిన మురారి, రాధల సంసార నౌకను తీరం చేర్చలేకపోయిన రాజశేఖరం (వక్రగతులు) కష్టపడి చదివించిన తల్లిని అవమానిస్తున్న మిత్రుడు మురళిని ఏమీ అనలేక తులసమ్మ మీద జాలిపడే రాజశేఖరం (వగపేటికి చల్ల చిందినన్) గ్రామ రాజకీయాల్లో వెనక అంగబలం, అర్థబలం లేని అవివాహిత శకుంతల (వ్యవస్థ) స్పాట్ వాల్యుయేషన్ లో చలాకీగా తిరిగినా నిజ జీవితంలో ఎన్నో బరువు బాధ్యతలను తలకెత్తుకున్న నాగమణి టీచర్ (స్పాట్‌లైట్) ఉద్యోగం వదలి సేద్యం చేపట్టిన రాయదుర్గం నరసప్ప పంతులు (హాలికులు కుశలమా?) మొదలైన పాత్రల పరిస్థితులలో సన్నివేశాలలో రచయిత ప్రవేశించి పాత్రల మనస్తత్వాలను పరిశీలిస్తూ, వ్యాఖ్యానిస్తూ కథ నడుపుతాడు.

## రాజారాంగారి కొన్ని విశిష్ట పాత్రలు

రాజారాం గారు పాత్ర జీవిత చరిత్ర అంతా చెప్పకుండా ఒకే కోణం నుండి పాత్ర వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించడం గమనించవచ్చు. మిగతా కోణాలన్నీ పాఠకుడి ఊహకే వదిలి వేయడం జరుగుతుంది. కానీ పాఠకుడు ఆ ఒక్క కోణం నుండే పాత్రను సమగ్రంగా అర్థంచేసుకునే అవకాశం వుంది.

అయితే కొన్ని సందర్భాలలో పాత్రను గురించి సమగ్రంగా కథాదిలోనే చర్చించడం గమనించవచ్చు అందుకే "ఒక పాత్రను చిత్రింప తలపెట్టినప్పుడు రచయిత ఆ పాత్ర పుట్టుపూర్వోత్తరాలు స్పష్టంగానే తెల్పి తృప్తి పడినట్లు కనబడుతుంది ఆ సమయంలో కథా గమనం పరీక్షించే అవకాశం వైపు దృష్టి ప్రసరించకుండా పాత్ర చిత్రణలో లీనమైపోయే రచయిత ఏకాగ్రత ఒక విధంగా ప్రశంసా పాత్రమే" అంటారు. డా॥ కొలకలూరి ఇనాక్ గారు 1

ఈ దృష్టితో రాజారాం గారి పురుష పాత్రలన్నీ ఒకే విధంగా కనిపిస్తాయి కథల్లో వచ్చే ఉపాధ్యాయుడు, ఉపాధ్యాయులందరికీ ఆదర్శమూర్తిగా కనిపిస్తాడు. సందర్భానుసారంగా ఇంకా కొందరు ఉపాధ్యాయ పాత్రలు కనబడినా ఈ ఆదర్శ ఉపాధ్యాయ పాత్ర మాత్రం వాటన్నింటికి ప్రతినిధిగా ఒకటే పాత్ర వివిధ పరిస్థితుల్లో వివిధ రూపాల్లో దర్శనమివ్వడం గమనించవచ్చు. తాశిల్దార్లు, మునసబు కరణాలు, రైతులు, మామయ్యలు, బాబాయిలు, ఆఫీసర్లూ, గుమాస్తాలు మొదలైన ఏ పాత్రను తీసుకున్నా ఆ పాత్రను పూర్తిగా పాఠకుని మనోనేత్రం ముందు సజీవంగా

ఆవిష్కరించడం రాజారాం గారి కథల్లోని ప్రత్యేకత. అందుకే డా॥ కొలకలూరి ఇనాక్ గారు "రాజారాం గారికి పురుష పాత్రలు ధరించే నేర్పు ఫోర్‌డై మన్షన్స్‌లో వుంది" అని అభిప్రాయపడ్డారు.[2]

## (అ) పిచ్చి వెంకట్రావు కథలో వెంకట్రావు

ఈ కథలోని వెంకట్రావుతో తమకు చాలా పరిచయమున్నదని, అతని వ్యక్తిత్వాన్నే ఈ కథగా మలిచానని, రచయిత ఈ కథ చెప్పబోతూ ముందు మాటగా చెప్పుకున్నారు.

కథ ప్రారంభంలో వెంకట్రావు గారు బాణావరం స్కూలుకు హెడ్మాస్టరుగా వస్తున్నారని తెలిసి ఉపాధ్యాయులందరూ ఆయన గురించి మాటాడుకుంటూ వుంటారు. వారి మాటల్లో చాలా వరకు ఆత్మీయాలే ( Subjective ) అయినా వాటిలోనే వెంకట్రావు గారి వ్యక్తిత్వం చాలావరకు రూపుకడుతుంది. రూల్సు కోసం మనిషి కాదని, మనిషి కోసం రూలనే వెంకట్రావు గారి అభిప్రాయం పాఠకుడికి అవగతం అవుతుంది.

చావు బతుకుల్లో ఉన్న డ్రాయింగ్ మాస్టార్ని హాస్పిటల్‌కు తీసుకువెళ్ళవలసి వచ్చినపుడు రైలుకు అడ్డం పడి ఆపగల ఆత్మబలం వెంకట్రావు గారికే వుంది. అయితే ఆ రైలు డ్రైవరు వెంకట్రావు గారి పూర్వ విద్యార్థి అనీ వెంకట్రావు గురించి బాగా తెలిసిన వాడనే విషయాన్ని కథాంతంలో చెప్పి రచయిత పాఠకులను ఆశ్చర్యానందాల్లో ముంచుతాడు. ఈ కథలో వెంకట్రావు పాత్ర సమగ్ర చిత్రణ జరిగింది ఒక విధంగా దీనిని కథ అనే బదులు వెంకట్రావు గారి వ్యక్తి చిత్రణ (Profile) అనడం సబబుగా వుంటుంది.

## [ఆ] సాక్షాత్కారం కథలో శంకరం

రాజారాం గారి కథల్లో ఈ శంకరం పాత్ర విలక్షణమైనది. "సాక్షాత్కారం" అనే ఈ కథను ఆసాంతం చదివే వరకు పాఠకునికి శంకరం పాత్రమీద మంచి అభిప్రాయం కలుగదు. కథ చెప్తూ కథలో పాత్రగా జీవిస్తున్న రచయిత కూడా ఈ పాత్ర మీద సదభిప్రాయాన్ని కనబరచడు. కథ కొనసాగుతున్నంతసేపూ ఉదయించే సూర్యునివలె శంకరం పాత్రలోని కొన్ని కొన్ని లక్షణాలు క్రమక్రమంగా బయట పడుతూ చివరికి శంకరం పాత్ర విశ్వరూపం ప్రత్యక్షమవుతుంది. అందుకే ఈ కథ పేరు "సాక్షాత్కారం"

---

1, 2, రాజారాం సాహితీ వ్యాసంగం — సాహిత్య వ్యాసాలు (వ్యాస సంపుటి) డా॥ కొలకలూరి ఇనాక్ సి ఎల్. ఎస్. బుక్ షాప్, స్టేషన్ రోడ్ హైదరాబాద్ - 1. (1974)

శంకరం ఒక ఆఫీసులో గుమాస్తా సరిగ్గా ఆఫీసు సమయానికి వచ్చి మళ్ళీ ఐదు గంటలకల్లా వెళ్ళిపోవడం అతని దినచర్య. ఆఫీసులో ఎవరితోనూ ఎటువంటి సంబందాలు అతనికి లేవు. అందుకే శంకరం అంటే అందరికీ తేలిక భావం. చాటుగా అతని గురించి రకరకాల ఊహాగానాలు చేస్తుంటారు.

రాజశేఖరం అదే ఆఫీసులో పనిచేస్తుంటారు. అతనికి కూడా శంకరం తేలిక భావమే. రాజశేఖరం కూతురు పుట్టినరోజు వేడుకల్లో శంకరం పాల్గొనక పోగా భార్యను కూడా పంపించడు అప్పటి నుండి శంకరం అంటే అందరికీ తేలికభావం ఏర్పడి పోతుంది.

కాని రాజశేఖరం భార్యకు శంకరం అంటే ఎందుకో జాలి ఆవిడ ఆరాతీయగా రాజశేఖరం భార్య రాజేశ్వరి శంకరం భార్య రేవతి ఇద్దరూ బాల్య స్నేహితులు అనే విషయం తెలుస్తుంది. అక్కణ్ణుండి కథ మలుపు తిరిగి శంకరం పాత్ర ఆవిష్కారం ప్రారభమతుంది.

శంకరం భార్య మీది ఆరు తులాల గొలుసుతో చెల్లెలి పెళ్ళి జరిపించాడని, డాక్టరు కోర్సు చదువుతున్న తమ్ముని కోసం నెలకు రెండొందల రూపాయలు పంపుతాడని, ప్రావిడెంటు ఫండు నుండి నెలకు యాభై రూపాయల కొత అనీఒక్కొక్కటిగా శంకరం విషయాలు తెలుస్తుంటాయి ఇంతలో ఆఫీసు అటెండరు జకరయ్య దగ్గర రెండొందల రూపాయలు అప్పు తీసుకొని శంకరం ప్రయివేటుగా బి, ఎ. కట్టి పాసవుతాడు ప్రమోషన్ వచ్చి వెళ్ళిపోతాడు.

మళ్ళీ చాలా రోజులకు రాజశేఖరానికి హైదరాబాదులో శంకరం ఆఫీసరుగా తటస్థపడతాడు. శంకరం అతని భార్య రాజశేఖరాన్ని చాలా ఆదరిస్తారు. శంకరం ఇప్పుడు చాలా మారిపాతాడు ఈ మధ్యకాలంలో శంకరం తండ్రి మరో పెళ్ళి చేసుకొని నలుగురు బిడ్డల తండ్రయి మరణిస్తాడు సవతి తల్లి తమ్ముళ్ళ పోషణ భారం గూడా శంకరంమే తలకెత్తుకున్నాడన్న సూచనతో కథ ముగుస్తుంది చివరికి శంకరం పాత్ర సాక్షాత్కారం గురించి చెపుతూ......

" చివురించే అనుభవం ఎలా వుంటుందో
మోడుకు తెలియకపోవచ్చు.
కరిగి నీరై పారె అనుభవం ఎలావుంటుందో
రాతికి తెలియక పోవచ్చు
నేను మనిషిని కనుక ఊహిస్తున్నాను. మోడునై వుంటే
అక్షణాన చివురించే వాణ్ణి
రాయినైవుంటే అక్షణాన కరిగి నీరై ప్రవహించే వాణ్ణి

---

1. నాకు నచ్చిన నా కథ పిచ్చి వెంకటావు.
మధురాంతకం రాజారాం. "యువ" మాసపత్రిక ఫిబ్రవరి 1984.

ఎల్లలెరుగని మంచి తనం కూడా ఒక బలహీనత కావచ్చు
కానీ దాని వెనక తలవంచి మొక్కాల్సిం మినహాగా
మరొక్క భావన కలగడానికి అస్కారం లేదనిపిస్తుంది.
ఆ భగవంతుణ్ని ఎవరు చూశారు?"

రచయిత పాఠకులకు వేసిన ప్రశ్నలో మానవునిలోనే మాధవుణ్ని దర్శించుకొన్న గొప్ప అనుభూతి దాగివున్నది. ఈ అనుభూతికంటే కథకు మించిన ప్రయోజనమేమున్నది.

## [౨] ఆశ్రయం కథలో భవానీ శంకరం

ఈ కథ ఒక ప్రఖ్యాత చిత్రకారుని వ్యక్తి చిత్రణ (Profile) అని చెప్పవచ్చు. రాజశేఖరం (రచయిత) హైదరాబాద్ వచ్చినప్పుడల్లా ఒక సమస్య ఎదురయ్యేది. అది "ఆశ్రయం ఎక్కడ"? అని. భవానీ శంకరం గారితో పరిచయం ఏర్పడిన తరువాత ఈ సమస్య తీరిపోయింది. ఇప్పుడు హైదరాబాద్ వచ్చినా వారింట్లోనే మకాం.

భవానీ శంకరం గారు కాంకోటి లోని ఒక చిన్న పెంకుటింట్లో వుంటారు. వారింట్లో ఎదురుగా ఒక చక్కటి వర్ణచిత్రం వేలాడుతూ వుంటుంది. అందులో ఒక చిన్న ఇల్లు, దాని చుట్టూ పూలమొక్కలు చిత్రించబడి వుంటాయి. అది భవానీశంకరం గారి ఆదర్శ కుటీరం ఎప్పటికైనా అటువంటి ఇల్లు కట్టుకోవాలని భవానీశంకరం గారి కోరిక. ప్రస్తుతం అద్దె ఇంటిలోనే అధితీ అభ్యాగతులను ఆదరిస్తున్నారు. భవానీ-శంకరం గారి భార్య సుమిత్ర కూడా అతనికి తగిన భార్యే! చిత్రరచనకు ప్రతిఫలాన్ని ఆశించక పోవడం గూడా అతని హాబీల్లో ఒకటి.

ఒక మిత్రుని ప్రోద్బలంతో చిత్రాల వ్యాపారం ప్రారంభించి తీవ్ర నష్టానికి గురవుతాడు. ఆ మిత్రుడు ఇటువంటి చిత్రకారులు ఎందరి చేతనో చిత్ర రచన చేయించి లక్షలార్జించారు. అందులో చిత్రకారులకు దొరికింది కూలి మాత్రమే భవానీశంకరం గారికి కూడా కూలీ కంటే ఎక్కువ లాభించలేదు. ఇప్పుడు భవానీ-శంకరం గారు సిటీకి దూరంగా అద్దె కొంపలో నివశిస్తున్నారు

ఈ కథ జరిగి చాలా రోజులయిం తరువాత ఒకసారి కళాభవన్‌లో జరిగిన చిత్ర కళా ప్రదర్శనలో భవానీశంకరం గారి "ఆదర్శకుటీరం" చిత్రం కూడా ప్రదర్శిత-మవుతుంది. దానిని రచయిత చూడడం తటస్థిస్తుంది. ఆ చిత్రానికి వెల నాలుగు వందల యాభై రూపాయలు అని వుంటుంది. ఆ చిత్రం అంత చవకగా అమ్ముడు పోతున్నందుకు కాదు గానీ తమ దగ్గర అంత డబ్బు లేకపోయినందుకు రచయిత బాధపడతారు. అంతటితో కథ ముగుస్తుంది.

ఈ కథలో కళాకారుణ్ని దోచుకుంటున్న సమాజం చిత్రిత మయింది. చిత్ర కారుడైన భవానీ శంకరంగారి పాత్ర చిత్రణ అద్వితీయమైనది. ఆదర్శ కుటీరం చిత్రాన్ని అమ్మకానికి పెట్టడం అనే ముగింపు కథకు సహజత్వాన్ని సంతరించిపెట్టింది.

రాజారాం గారి పురుష పాత్రల వలెనే స్త్రీ పాత్రలు కూడా సంపూర్ణ వ్యక్తిత్వాన్ని కలిగి వుంటాయి.

**"ఆడవాళ్ళు తమ అభిప్రాయాలను తేల్చిచెప్పరు. ఏమిటో చెయ్యాలనుకుంటారు మరేమిటో చేస్తున్నట్లు అభినయిస్తారు. మనస్సులోపలి మారుమూల గదిలో తమ కోరికలను గుప్త పరచుకొని తలుపు మూసుకొని తాళం చెవి మన చేతికి దొరకకుండా ఉండడానికి ఎంత శ్రమయినా తీసుకొంటారు."** 1

**అన్న రాజారాం గారి అభిప్రాయం వారి స్త్రీ పాత్ర చిత్రీకరణలో ద్యోతకమవుతుంది.**

రాజారాం గారి కథానికల్లో కొన్ని ముఖ్యమైన స్త్రీ పాత్రలు ఈ విధంగా వున్నాయి.

| | | |
|---|---|---|
| ఉద్యోగం | కథానికలో | కస్తూరి |
| ఏకాకి | " | కామాక్షమ్మ |
| కూనలమ్మ కోన | " | నాగరత్నం |
| కొరకరాని కొయ్య | " | సరస్వతి |
| ఖాళీఘటా | " | కమలారాణి |
| చెక్కుటద్దం | " | వాసంతి |
| కాటుకకంట నీరు | " | సుమిత్ర |
| జగన్నాటకం | " | సులోచన |
| ట్రంపు చీటి | " | కనకవల్లి |
| టీ కప్పులో కల్లోలం | " | విమలాదేవి |
| తిరస్కృతి | " | సుందరమ్మత్త |
| ద్వంద్వ సమాసం | " | జానకిమేడం |
| దుష్ట సమాసం | " | ప్రమీలదేవి |
| నోరులేని జీవుడు | " | కనకం |
| పతిదేవుళ్లూ ఆడకూతుళ్లూ | " | సుజాత |
| ప్రాణదాత | " | నీరజ |
| ప్రియబాంధవి | " | పంకజం |
| పుట్టిల్లు | " | అనూరాధ |

---

1. **అక్కయ్య అంతరంగం – కథానిక – మధురాంతకం రాజారాం.**

| | | |
|---|---|---|
| పునర్నవం | కథానికలో | లక్ష్మి |
| బ్రతుకుబాట | ” | శ్యామల-రాజేశ్వరి |
| మనుషులు-మమకారాలు | ” | పార్వతమ్మ |
| మహానటుడు | ” | శారద |
| ముకుళిత పద్మం | ” | నీరజ |
| రుచులజాడవేరు | ” | పార్వతమ్మ |
| వక్రగతులు | ” | రాధ |
| వగపేటికి చల్లచిందినన్ | ” | తులసమ్మ |
| వ్యవస్థ | ” | శకుంతల |
| సంఘజీవి | ” | పద్మావతి |
| సబల | ” | విశాల |
| సర్వీసు రిజిష్టరు | ” | లీలావతమ్మ |
| స్పాట్‌లైట్ | ” | నాగమణి |
| స్వస్థానం | ” | నీరజ |

ఈ పాత్రలే కాకుండా కథలో కీలకస్థానంలో వున్న కొన్ని స్త్రీ పాత్రల పేర్లు రచయిత సూచించకపోవడం గమనించవచ్చు. ఆ పేర్లు చెప్పనందువలన కథలో లోపమేమీ కానరాదు. ఉదా॥ "వెలుగు సముద్రంలో చీకటిదీవి" కథలోని కీలక పాత్రయైన ఆ ఇంటి కోడలిపేరు చెప్పకపోవడం ఔచిత్యం కావచ్చు లేదా పెద్దింటి స్త్రీలపేర్లు బయటివాళ్లకు తెలియక పోవడం సహజం. " అక్కయ్యా అంతరంగం " కథలోని అక్కయ్య కూడా నిగమశర్మ అక్కవలె పేరు లేనిదే!

రాజారాంగారి కథల్లో పైన ఉదహరించిన స్త్రీ పాత్రలు స్థూలంగా ముఖ్యమైనవి. ఇందులో పరిస్థితులను ఎదిరించి సొంత వ్యక్తిత్వంతో నిలబడిన విశాల (సబల), జీవితంలో దగాపడి ఏకాకిగా మిగిలిన కామాక్షమ్మ (ఏకాకి), కూతురి పెళ్లికోసం ఆరాటపడే సరస్వతి (కొరకరానికొయ్య). తనకు లేనిది ఇతరులకు ఎందుకు అని భావించే హెడ్‌మిస్ట్రెస్ విమలాదేవి (టీకప్పులో కల్లోలం), ఆదర్శాల పేరిట జీవితాన్ని నాశనం చేసుకున్న నీరజ (ముకుళిత పద్మం) మొదలైన లోకంలో కనిపించే ఎందరో స్త్రీలు ఈ పాత్రల్లో సజీవంగా కనిపిస్తారు.

**(ఈ) సభల కథలో విశాల :—**

విశాలా రామారావులది ప్రేమ వివాహం వారిది అన్యోన్య దాంపత్యం.

వారికో చిన్నారి పాప. పాప పేరు పద్మప్రియ. ఆ పాప పుట్టినరోజు పార్టీలో తాను ఉదాసీనంగా ఉన్నందుకు కారణం చెప్పబోతూ విశాల ఫ్లాష్ బ్యాక్ లో మేష్టారుగారికి (రచయిత) తన గతం చెప్పతుంది,

విశాల తల్లిని చిన్ననాటనే కోల్పోయింది. తండ్రి మరో పెళ్లిచేసుకున్నాడు. సవతితల్లి విశాలనొక రోగిష్టివాడికిచ్చి పెళ్లి చేస్తుంది. అతడు కాస్తా హరీమంటాడు. విశాల తండ్రీ-సవతి తల్లీ విశాల భర్త ఆస్తికోసం దావావేస్తారు. ఆ లాయరు విశాల ను పెళ్లి చేసుకొని ఆస్తిని చేజిక్కించుకోవాలనుకుంటాడు. కానీ విశాల తన మామ గారితో ఒప్పందం చేసుకొని కొంత ఆస్తి స్వీకరించి దావా ఉపసంహరించుకుంటుంది. ఈ విషయం తెలిసిన సవతితల్లి విశాలను ఇంటినుండి గెంటివేస్తుంది విశాల హాస్టల్లో వుండి చదువు కొనసాగిస్తుంది. ఒకసారి ప్రమాదవశాత్తు నీటిలో పడిన విశాలను రామారావు అనే సహాధ్యాయి రక్షిస్తాడు. అలా పరిచయమయిన వారి స్నేహం ముం దుగా ప్రణయం తర్వాత పరిణయంగా పరిణమిస్తుంది. ఇదీ విశాల పూర్వ చరిత్ర. పార్టీ జరుగుతున్నప్పుడు విశాల తండ్రి మరణవార్త తెలుస్తుంది. అది ఆమె గతాన్ని గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రేరణ.

విశాల పాత్రను రచయిత మొదటినుండి 'సబల' గానే చిత్రిస్తున్నాడనే విష యాన్ని గమనించాలి. నిస్సహాయ పరిస్థితుల్లో రోగిష్టిని పెళ్లి చేసుకున్నా మామగారి మీది జాలితో దావాను ఉపసంహరించికోవడం, హాస్టలో ఒంటరిగా స్వతంత్రంగా జీవిం చడంవంటి సంగతులు విశాలను 'సబల' గా చిత్రిస్తున్నాయి అయితే, "ముక్కూ మొఖం తెలియనివాడు ప్రాణాలు రక్షిస్తే వాణ్ణి పెళ్లిచేసుకోవడమేనా? అయితే అదే ఏముష్టివాడో, ముసలివాడో అయితే చేసుకునేదేనా?" 1
అని అనుమానాన్ని వ్యక్తం చేశారు డా॥ కొలకలూరి ఇనాక్‌గారు

విశాల పాత్రను మొదటినుండీ గమనించినట్లయితే ఈ అభిప్రాయం తప్పని తేలుతుంది పురాణాల్లోవలె చెయ్యి పట్టుకున్నందుకే పాణిగ్రహణము అయిందనే మొండిపట్టుదలగల స్త్రీ కాదు విశాల. పరిస్థితులకనుగుణంగా భావాలను; అభిప్రా యాలకోసం పరిస్థితులను ప్రతిఘటించడం మొదటినుండి ఆమె వ్యక్తిత్వంలోవున్నాయి తన ప్రాణదాతతో పరిచయం పెంచుకొని ప్రేమించి, ప్రేమను పొంది, చివరకు పెళ్లి చేసుకొని ఆనందంగా కాపురం చేస్తున్నది విశాల. అదే చోట డా॥ ఇనాక్ గారన్నట్లు

---

1 రాజారాం సాహితీ వ్యాసాంగం (సాహిత్యవ్యాసాలు)
సి.ఎల్.ఎస్. బుక్ సెంటర్, స్టేషన్‌రోడ్, హైదరాబాదు-1

ఏ ముష్టివాడో, ముసలివాడో తనను రక్షిస్తే అర్థికంగా ఏదైనా ముట్టజెప్పేదేకానీ ఎదురయిన ప్రతివ్యక్తినీ ప్రేమించే మనస్తత్వం కాదామెది అనేది స్పష్టమే!

అదీగాక తన ఆస్తిని చూసి ప్రేమించామంటూ వచ్చిన యువకులకు పరీక్ష పెట్టడానికే విశాల నీటిలో మునిగింది. కానీ వారెవ్వరూ ప్రాణాలకు తెగించి విశాలను రక్షించడానికి రాలేదు. రామారావు ఆమెను రక్షించాడు. అంతవరకు రామారావెరో విశాలకు తెలియదు. విశాల ఎవరో రామారావు ఎఱుగడు. దీనివలన విశాల ఎంత గడుసుదో తెలుస్తున్నది. కథ ముగింపులో రచయిత విశాలకు ఈత వచ్చునన్న సత్యాన్ని చెప్పి ఆమె గడుసుదనం పరాకాష్టను పాఠకుల ముందుంచారు.

ఈ విధంగా రాజారాం గారు సృష్టించిన పాత్రలన్నీ ఆదర్శవంతంగా కనిపిస్తాయి. ప్రతిపాత్రా ఏదో ఒక సందేశాన్ని అందించడానికే సృష్టించబడినట్లు తోస్తుంది లోకంలో సహజంగా జరిగే సన్నివేశాల కల్పనద్వారా పాత్రలు సజీవంగా నిలిచి వాటి మనస్తత్వాలు పాఠకునికి అర్థమవుతాయి. అసహజ సన్నివేశకల్పన ఎక్కడ వుండక పోవడం గమనించవచ్చు ఏ పాత్రకూడా విశృంఖలంగా ప్రవర్తించదు తన పరిమితిలోనే వుంటుంది.

రాజారాంగారికి తమ పాత్రలపై విపరీతమైన సానుభూతి. అది లేకపోవడం మహాపాపం అంటారు డా॥ కొలకటూరి ఇనాక్‌గారు.



# V

# శిల్పజ్ఞత

శిల్పం అన్నపదానికి సామాన్యంగా లోహంతో చేసిన లేదా రాతి పై చెక్కిన బొమ్మ అనే అర్థం వాడుకలో వుంది అయితే అది వాస్తు శిల్పానికి సంబంధించింది. సాహిత్య పరిభాషలో దీనిని ఆంగ్లంలోని టెక్నిక్ (Technique) అన్న పదానికి సమానార్థకంగా వాడుతున్నారు

" అమలోదాత్త మనీష నేను భయ కావ్య ప్రౌఢి పాటించు
శిల్పమునన్ బారగుడ, కళ విదుడ "

అన్న తిక్కన మాటల్లో శిల్ప శబ్దానికి నైపుణ్యం అనే అర్థం వస్తుంది. ఉభయ భాషల్లో కావ్యాన్ని, ప్రౌఢంగా చెపే నేర్పు తనకుందని తిక్కన చెప్పుకున్నాడు. ఆ నేర్పరితనమే శిల్పం. అదొక గొప్ప కళ అందుకే నైఘంటికార్థంలో శిల్ప శబ్దానికి కళ నైపుణ్యం, సంస్కారం మొదలైన అర్థాలు కనబడతాయి. 1

శిల్పానికి నైపుణ్యం అనే అర్థం చెప్పుకున్నప్పుడు ఇది ఎటువంటి నైపుణ్యం? దీనివల్ల కథకు చేకూరే ప్రయోజనం ఎటువ ంటిది? అని ఆలోచించాలి.

కథాంశాల్లో ఒక్క దానికి సంబంధించింది కాదిది. కథాకథనానికి ఎన్నుకున్న పద్ధతితో ప్రారంభమై సంఘటనల ఘటనలో గాని, సన్నివేశ కల్పనలోగాని, భాషాశైలీ, శీర్షికలు. ఎత్తుగడ, ముగింపుల్లో ప్రతిఫలించి వీట న్నింటి సమగతూ సమ్మేళనంతో చిత్రవర్ణ రంజితంగా విరాజిల్లేదే శిల్పం.

కథకు వస్తువే మూలమైనా దానిని కథగా తీర్చిదిద్దే పనితనమే శిల్పం. శిల్పం లేని వస్తువు జీవకళ చేకూరని కొయ్యబొమ్మ వంటిది. కాబట్టి కథకు శిల్పం ప్రాణం వంటిదని అంటారు శీలా వీర్రాజు గారు. 2

ఏ కళారూపానికైనా శిల్పం వల్లే ప్రాణ ప్రతిష్ఠ జరుగుతుంది. శిల్పంతో ప్రాణం పోసుకున్న వస్తువు కథగా రూపొంది పఠన యోగ్యతను సంతరించు కుటుంది. ఈ ంగా కథను ఆసాంతం చదివింపజేసే విన్యాసాన్ని శిల్ప మనవచ్చు. కథరాయ

---

1. సూర్య రాయాంధ్ర నిఘంటువు.
2. కథానిక నిర్మాణ శిల్పం అందాల తెలుగు కథ (వ్యాససంపుటి) నవభారతి ప్రచురణలు బర్కత్‌పురా - హైదరాబాదు

డానికి ముడిసరుకు సమకూర్చుకుని, పాత్రల స్వరూప స్వభావాలను ఆకళించుకొని కథలో జరిగే సన్నివేశాలకు నేపథ్యాన్ని వాతావరణాన్ని ప్రతీకాత్మకంగా చిత్రించుకుంటూ వాటికను గుణంగా సంఘటనల్ని కూర్చుకుంటూ పోయే పద్ధతిని శిల్పంగా నిర్వచించవచ్చును.

కథని ఎక్కడ ఎలా మొదలు పెట్టాలి? ఎంత చెప్పాలి? ఎలా ఎక్కడ ముగించాలి ? అనే మెలుకువల సమాహార రూపమే కథాశిల్పం. శిల్పవిధానాన్ని ఈ తరగతులుగా విభజించవచ్చు

1. కథనశిల్పం
2. సంఘటనఘః
3 సన్నివేశకల్పనా శిల్పం
4. భాషాశైలి
5. వర్ణనలు
6. శీర్షిక
7. ఎత్తుగడ
8. ముగింపు

## 1. కథన శిల్పం

కథనం అంటే కథ చెప్పే పద్ధతి. పద్ధతులను అనుసరించి రాజారాంగారి కథల్లో నాలుగు రకాల కథలను గుర్తించవచ్చు. -

అ : ఉత్తమ పురుష కథలు
ఆ ప్రథమ పురుష కథలు
ఇ ; ఫ్లాష్‌బ్యాక్ కథలు
ఈ : ఉత్తరాల కథలు

<u>(అ) ఉత్తమ పురుష కథలు ;-</u> ఈ పద్ధతిలో రచయిత స్వయంగా కథలో పాత్రగా ప్రవేశించి తనచుట్టూ వున్న పాత్రల ప్రవృత్తులను ఎత్తిచూపుతూ వుంటాడు తాను చూసి, అనుభవించినట్లు కథ చెపుతాడు. ఇందులో "నేను" కథ చెప్తూ వుంటాడు. అదిచదివే పాఠకుడు శ్రోత మామయ్యలు, బాబాయిలు, వీరి గురించి చెప్పే కథలు ఈ కోవలోకి వస్తాయి. ఈ "నేను" తో కథకు గల ప్రమేయాన్ని ఈ క్రింది విధంగా గుర్తించవచ్చు.

"అప్పల నరసయ్య" కథలో ఈ "నేను" ఒక పాత్రగా ప్రవేశించి నరసయ్య జీవితానికి సాక్షిభూతంగా నిలుస్తుంది. నరసయ్య ప్రతి విషయం ఈ నేను తోనే విన్న

వించికుంటాడు. "ఎండమావి" కథలో "నేను" సుందరం వడివేలుకు పుల్లారెడ్డికీ మధ్య దుభాషీగా వవ్యహరిస్తుంది తమిళ కుర్రవాడైన సుందరం వడివేలు మాటలను తెలుగులో పుల్లారెడ్డికి ఈ "నేను" చెప్పుతుంది. కానీ "ఎక్కవలసిన రైలు" కథలో ఈ నేను చలపతి పాత్రను పరిశీలించడంలో తటస్థంగా వుండిపోయింది. "చలిచెలమ" కథలో దేవబంధుగారు ఈ 'నేను' కు తన పూర్వకథ చెపుతారు ఇందులో 'నేను' "శ్రోత మాత్రమే!" "ట్యూంపుచీటి" కథలో 'నేను' మేష్టారు రూపంలో గ్రామ రాజకీయాల్లో కల్పించుకుంటుంది "టీ కప్పులో కల్లోలం" కథలో 'నేను' మేష్టారు రూపంలో హెడ్‌మిస్ట్రెస్ విమలాదేవి కథ చెపుతుంది "త్రిశంకుడి స్వర్గం" కథలో కామేశం కథ చెప్పుతూ కామేశం మాటలన్నీ వింటుంది

దుష్ట సమాసం, కథలో ప్రమీలాదేవి పాఠశాల కథలో మామయ్య జీవితాలను నేను పరిశీలిస్తుంది అనగా ఈ కథలో 'నేను' ద్రష్ట. ప్రజాపతి కథలో విశ్వపతికి శ్రోత మిస్. మరీచిక, వక్రగతులు, వగపేటికి చల్లచిందిన్ కథల్లో 'నేను' తటస్థంగా వుండి పోతుంది పాత్రలతో మాట్లాడినా జరిగే సంఘటనలకు నేను బాధ్యుడు కాదు. వ్యవస్థ, స్పాట్‌లైట్ కథల్లో శకుంతల నాగమణిల అభిమానానికి పాత్రుడై వారి కథ తెలుపుతుంది వైరాగ్యంలో సరాగం కథలో మాధవయ్య మామ జీవితంలో వచ్చే మార్పులకు బాధ్యత వహిస్తుంది.

ఈ విధంగా కథకుడు పురుషుడే అయినప్పటికి ఒక్కొసారి స్త్రీగా కూడా కనిపించడం చూడవచ్చు ఈ కోవలో ద్వంద్వ సమాసం కథ కనిపిస్తుంది. ఈ కథలో 'నేను' జానకీ మేడం రూపంలో కథంతా తన అనుభవంగా చెపుతుంది

<u>(ఆ) ప్రథమ పురుష కథలు :-</u> సాధారణంగా కథలన్నీ ఈ కోవలోకే చెందుతాయి. రచయితకు కథతో ప్రత్యక్ష సంబంధం వుండదు. పాత్రలే తమ సంభాషణల ద్వారా సమయానుకూలంగా ప్రవర్తిస్తాయి. రచయిత కథారంగంలోకి ప్రవేశించడు. కథలోని సంఘటనలను సంభాషణలను, పాత్రలను సమయానుకూలంగా నడిపించడానికి వాళ్ల మాటల్లో చేతల్లో తన దృక్పథాన్ని ధ్వనించడానికి కథకునికి ఈ పద్ధతిలో ఎక్కువ అవకాశం వున్నది ఈ పద్ధతిలో పాత్రలను గురించి సమగ్రంగా వ్యాఖ్యానించడానికి కూడా రచయితకు అవకాశమున్నది.

ఈ కథలన్నీ డాక్యుమెంటరీ టెక్నిక్‌లో చెప్పిన కథలు అనవచ్చు. రచయిత తానొక దర్శకుని రూపంలో వుండి కథను పాఠకులకు నివేదిస్తూ వుంటాడు.

"ప్రథమ పురుష కథలే ఉత్తరోత్తరా చైతన్య స్రవంతి (Stream of Consciousness) పద్ధతికి మాతృక అయింది." అని పోరంకి దక్షిణామూర్తిగారు తమ సిద్ధాంత వ్యాసంలో పేర్కొన్నారు. అంగరక్షకుడు, అడ్డుదారి. అజ్ఞాత వాసం, అడిగి రాని వరాలు, ఆశయసిద్ధి, ఇంటాబయట, ఏకాకి కన్నెచెర, కాటుక కంటనీరు' కార్టూన్, కూనలమ్మ కోన, వజ్రపవి మొదలైన కథలన్నీ ప్రథమ పురుష కథలే !

(ఇ) ఫ్లాష్ బ్యాక్ కథలు :- "కొన్ని కథలు వర్తమానంలో ప్రారంభమై భూత కాలంలోకి నడిచి మళ్లీ ప్రస్తుతానికి వస్తూవుంటాయి. దీన్ని ఫ్లాష్ బ్యాక్ పద్ధతి (Flash Back)" అంటారని విహారిగారు పేర్కొన్నారు. 1

కథలో ఫ్లాష్ బ్యాక్ కథ లోపిస్తే అసలు కథేమిటో పాఠకునికి అర్థం కాకుండా ఈ కథనం సాగుతుంది. అంటే ఫ్లాష్ బ్యాక్ కథకు ప్రస్తుత కథకు విడదీయరాని సంబంధం వుంటుంది ఆ విధంగా వున్నప్పుడే అది ఉత్తమ కథ అనిపించుకుంటుంది.

## రాజారాంగారి ఫ్లాష్ బ్యాక్ కథలు ఈ విధంగా వున్నాయి

ఎకాకి : రఘు, సుశీల తిరుపతి వెళ్లినప్పుడు అక్కడ పువ్వులమ్మే ముసల్మను తన అమ్మమ్మగా గుర్తిస్తాడు రఘు. వెంటనే రఘుకు తన గతమంతా గుర్తుకు వస్తుంది. రఘు మళ్లీ వర్తమానంలోనికి వచ్చే అమ్మమ్మ ఆ తీర్యం స్వీకరించే సరికి కథ ముగుస్తుంది.

ప్రాణదాత : నీరజ డాక్టరు. ఒక పేషెంటును చూడటానికి వెళ్లి ఆ పేషెంటును సారథిగా గుర్తిస్తుంది. వెంటనే ఆమెకు గతమంతా గుర్తుకు వస్తుంది మళ్లీ వర్తమానంలోకి వచ్చి సారథిని పెళ్లి చేసుకోవాలనే సూచనతో కథ ముగుస్తుంది.

చలిచెలమ : అంజిగాడనే అభాగ్యుడు చిన్ననాటి మిత్రుని కొడుకుని చూచి గతమంతా గుర్తుకు తెచ్చుకొని శేషాద్రి కథ చెపుతాడు.

పురుషులకు ప్రత్యేకం : శారద భర్త ఆమెను హింసించి విడాకులు పొందుతాడు. చాలా రోజుల తరువాత అతడు రాజశేఖరానికి కనిపిస్తే రాజశేఖరానికి శారద కథ గుర్తుకు వస్తుంది.

వక్రగతులు : రాధ చావుకు పరోక్షంగా కారణమైన మురారి పట్నంలో కనిపిస్తే రచయితకు రాధ గుర్తుకు వస్తుంది.

ముకుళిత పద్మం : బిచ్చగాళ్ళ దాంపత్యాన్ని చూసి తనను ప్రేమించిన వ్యక్తి గుర్తుకు రావటం తద్వారా నీరజ కథ ఫ్లాష్‌బ్యాక్‌లో సాగడం జరుగుతుంది.

---

1 తెలుగు కథ - శిల్పం. వ్యాసం. విహారి. అందాల తెలుగు కథ వ్యాస సంపుటి.

| | | |
|---|---|---|
| వ్యవస్థ | : | దూరపు బంధువు పెళ్ళికి పోయిన మేష్టారుకు అక్కడ రిక్షా తొక్కుతున్న రామ్మూర్తి కనిపించగానే శకుంతల కథ గుర్తుకు వస్తుంది. |
| సంక్రాంతి శంఖం | : | సంక్రాంతి పండగనాడు కథకుడు తన చిన్ననాటి కథలను గుర్తుకు తెచ్చుకోవడం జరుగుతుంది |
| సబల | : | పాపాయి పుట్టినరోజు నాటి రాత్రి విశాల తన కథను ఫ్లాష్ బ్యాక్ రూపంలో మేష్టారుగారికి చెప్పుతుంది. |
| సర్వీసు రిజిష్టర్ | ; | విశ్వం అనే కుర్రవాడి వలన కోపం తెచ్చుకొన్న లీలావతమ్మకు ఇరవైరెండేళ్ల కిందటి సంఘటన గుర్తుకు వస్తుంది |
| స్పాట్‌లైట్ | : | నాగమణి తన జీవిత చరిత్ర మేష్టారుగారికి చెప్పుకుంటుంది. |
| మహానటుడు | : | మున్సిపల్ చేర్మన్ శ్రీమన్నారాయణ ఉపన్యాసంచేస్తున్నప్పుడు అతని భార్యకు గతమంతా గుర్తుకు వస్తుంది. |
| హాలికులు కుశలమా | : | చుట్టపు చూపుగా ఒక పల్లెటూరికి వెళ్లిన మేష్టారుగారికి అక్కడ రాయదుర్గం నరసప్ప పంతులు ఉన్నాడని తెలియగానే అతని పూర్వచరిత్ర గుర్తుకు వస్తుంది |
| నిషిద్ధాక్షరి | : | ఆనందరెడ్డి వకీలు తన మిత్రులకు కాలేజీ అనుభవాలు చెప్పడం వర్తమానంలో కాలేజీ మిత్రుడు బషీరుద్దీన్ కలువడం ఇదీకథ. |
| నోరులేని జీవుడు | : | దేవళం మిట్ట వరదరాజస్వామి గుడి ముందర కాపలావున్న పోలీసులను చూసి రచయితకు ఆ గుడిని నమ్ముకొని జీవించిన ఆచారీ, కనకం ల కథ గుర్తుకు వస్తుంది. |
| కాటుక కంటి నీరు | : | సుమిత్ర సిద్ధాంతిగారి దగ్గర రుక్మిణి కథ గుర్తుచేస్తుంది |
| బెరామీటరు | : | సుందరం ఉద్యోగానికి రాజీనామా చేసి పార్కులో బెంచీమీద పడుకొని తన గత స్మృతులను నెమరు వేసుకుంటాడు, |

ఈ విధంగా ఫ్లాష్‌బ్యాక్ పద్ధతిలో కథాకాలం వర్తమానమైనా మధ్య మధ్య భూతకాలంలోకి వెళ్ళి రావడం కథకు రెండు కాలాల సమగ్రత్వం సిద్ధిస్తుంది. పాఠకునిలో ఉత్కంఠతను రేకెత్తించి కథను ఆసాంతం చదివించడానికి ఈ పద్ధతి వీలు కలిపిస్తుంది.

## [ఈ] ఉత్తరాల కథలు

ఈ పద్ధతిలో కథంతా ఒక ఉత్తరం రూపంలో వుండవచ్చు. లేదా ఉత్తరానికి జవాబు రూపంలో వుండవచ్చు. కథ మొత్తం ఉత్తరాల రూపంలో సాగినా అందులోని ఏకసూత్రత వలన పాఠకులకు కథంతా అర్థమవుతుంది. ఈ రకం కథల్లో ఏకసూత్రత పాటించడం చాలా కష్టమైనపని చేయితిరిగిన కథకుడు అయితేనే ఈ పద్ధతిలో రక్తి కట్టించగలడు.

ఈ టెక్నిక్‌లో రాజారాంగారి కథలు మూడు కనిపిస్తాయి.
1) ఎమర్జెన్సీ 2) నూటా ఒకటో తప్పు 3) మయసభ.

ఎమర్జెన్సీ – ఈ కథలో డొక్కా జోగినాధం అనే రిటైర్డ్ ఉపాధ్యాయుడు డబ్బు లేక, ఆకలికి ఆగలేక సుందర విలాస్ హోటల్‌లో టిఫిన్ తిని అవమానం పొంది వెళ్లి పోతాడు. తర్వాత హోటల్ ప్రొప్రయిటరుకు డబ్బు ఎం ఓ. చేస్తూ రాసుకున్న ఉత్తరం కథారూపం దాల్చింది.

నూటా ఒకటో తప్పు:- స్కూల్లో భోజన పథకం కోసం ఖర్చు చేయవలసిన డబ్బు సొంతానికి వాడుకొని అంతరాత్మ ఘోషిస్తుంటే, ఒక ప్రమాదం నుండి వెంట్రుక వాసిలో తప్పించుకొని "పంపాపతి" అనే మిత్రునికి ఒక మేష్టారు రాసుకున్న ఉత్తరమే ఈ కథ

మయసభ :- ఈ కథంతా ఉత్తరం రూపంలో సాగదు. కానీ మధ్యలో వచ్చిన ఒక ఉత్తరం వలన కథలో ఒక చక్కని మలుపు వచ్చి కథాగమనమే మారిపోతుంది.

## 2. సంఘటన ఘటనా శిల్పం :

లోకంలో ఎన్నో సంఘటనలు జరుగుతూ వుంటాయి. సంఘటనను ఒక పత్రికా విలేఖరి దానిని వార్తగా ప్రకటించవచ్చు. ఒక కవి స్పందించి కవితా రూపంలో దానిని వెలిబుచ్చవచ్చు. ఒక కథకునికి ఆ సంఘటనలో కథకు కావలసిన ముడి సరుకు లభించి అది కథా వస్తువుగా ఉపయోగపడవచ్చు. లేదా ఆ వస్తువు ఇతివృత్తంగా రూపొందేందుకు తోడ్పడవచ్చు. లేదా కథలోని కీలకమైన మలుపుకు కారణమై ఇతివృత్త ప్రయోజనాన్ని సార్థక పరచ వచ్చును. లేదా కథాగమన వేగానికి సాధనంగా పనికి-రావచ్చును.

ఒక కథలోని సంఘటనలు ఒకటి కావచ్చు లేదా అనేకం వుండవచ్చు అయితే అనేక సంఘటనలమధ్య వస్త్వైక్యాన్ని సాధించడం ఉత్తమ శిల్పం అనిపించుకుంటుంది.

ఈ విధంగా కథలో సంఘటనలు ఆకర్షక కేంద్రాలుగావుంటాయి. మిగతా కథాంశాలన్నీ దాన్ని అంటిపెట్టుకుని వుంటూ దానిచుట్టూ పరిభ్రమిస్తూ వుంటాయి. కథలోని కీలక స్థానాలలో సంఘటనలను ఘటించడం లేదా కూర్చడం అనేది కథకుని రచనాకౌశల్యం మీద ఆధారపడివుంటుంది.

ఈ దృష్టితో పరిశీలిస్తే రాజారాంగారి కథల్లో సహజంగావుండి భావస్ఫోరకమయిన కూర్పుతో కనిపిస్తాయి. రచయిత భాషాశైలి కూర్పుకు అనుగుణంగావుంటాయి అది ఈ క్రింది కథల వలన అవగతమవుతుంది

**గ్రూప్‌ఫోటో:–** ఈ కథలో కోదండం అనే వ్యక్తి ఒంటరిగా జీవిస్తూ వుంటాడు ఇతరులందరూ స్వార్థపరులని అతని ఉద్దేశం. ప్రతివారు ఏదోఒక లాభాన్ని ఆశించి బంధుత్వాలు పెంచుకుంటారని అతని విశ్వాసం. తల్లిదండ్రుల ప్రేమను విశ్వసించడు, పెళ్లి చేసుకోడు.

ఒకనాటి రాత్రి మరో ఊరికి సైకిల్‌మీద సినిమాకు వెల్లివస్తూ పడిపోతాడు కోదండం. ప్రాణాపాయ స్థితిలోవున్న కోదండాన్ని ఊరివారందరూ కలిసి డాక్టరుగారి సహాయంతో బతికిస్తారు.

ఈ సంఘటన వలన కోదండం పూర్తిగా మారిపోతాడు. ఈ సంఘటన కథలోని మలుపుకు కారణమయింది. కోదండం వివాహం చేసుకుని సుఖంగా కాపురం చేసుకుంటూవుంటాడు, కథ సుఖాంతమవుతుంది. ఈ సంఘటన తరువాత కథాగమనవేగం పెరుగుట గమనించవచ్చు.

**స్వస్థానం:–** ఈ కథలోని నాయిక నీరజ ఒక మధ్యతరగతి గృహిణి. పూలంగి తేరువీధిలో కాపురం వుంటుంది. ఆ వీధిలోని వారందరూ కూలీలే! వారందరిలో నీరజా, ఆమె భర్త ధనవంతులుగా చూడబడతారు. ఆ వీధిలోని స్త్రీలందరికి నీరజ ఆత్మీయురాలు. కానీ నీరజ ఆ స్త్రీలలో ఇమిడిపోదు. ఆమె అంతరాత్మలో తాను ఉన్నతురాలుననే అహంకారం వుంటుంది. ధనవంతులయిన స్త్రీలతో స్నేహం చేయాలని నీరజ కోరిక. కానీ తాను వారితో సరితూగగలేనని ఆమెకు తెలుసు. అందుకోసం నీరజ పొదుపుచేసి ఒక బంగారు నగ చేయించుకొని తద్వారా తానుగూడా శ్రీమంతురాలిననే అభిప్రాయానికివచ్చి కాపురాన్ని అశోకపురం కాలనీకి మార్చుతుంది

అయితే ఇక్కడి గొప్పింటి స్త్రీలు నీరజను తమ సాటి స్త్రీగా ఆమోదించరు ఒక యానాదిపిల్ల నీరజ నగను గిట్టవని అడిగేసరికి. నీరజ అహం పూర్తిగా దెబ్బతిం టుంది. ఆ అవమానంతో నీరజ తిరిగి పూలంగితేరు వీధికే కాపురాన్ని మారుస్తుంది

ఆ ఒక్క సంఘటన నీరజ మనస్తత్వాన్ని మార్చివేసింది. ఈ అవమానం జరగకపోతే నీరజకు సంఘంలో తనస్థానమేమిటో తెలియకపొయ్యేది. అది ముగింపు కుచక్కగా ఉపయోగపడింది.

**అడవిలో ధర్మదేవత:—** ఒకసారి మేష్టారు (రచయిత) ప్రయాణం చేస్తూవుంటాడు ఫారెస్టువాళ్లు చంద్రగిరి స్టేషన్లో రైడింగ్ జరుపుతారు. కట్టెలమోపులతో ప్రయాణం చేస్తున్నవారి వద్దనుండి కట్టెలు తీసుకొని జప్తుచేసి, కట్టెలను వేలం వేస్తారు. కాని దళారులు అతి తక్కువ ధరకే ఆ వేలంపాట జరిగేట్లుగా చూసి తామే కొంటారు దానివలన కట్టెలు కొట్టుకొని బతికేవాడికి లాభం లేదు, ప్రభుత్వానికీ లాభం లేదు మధ్య దళారులు మాత్రం లాభం పొందుతున్నారు.

హృదయాన్ని కదిలించే ఈ ఒక్క సంఘటన కథకు బీజమయింది. కష్ట పడ్డా ఫలితం దక్కని నిర్భాగ్యుల కథ ఇది. రైలు ప్రయాణంలో ఈ సంఘటన జరిగి ఇతివృత్తం సార్థకమయింది. ఈ సంఘటన లేకపోతే అసలు కథే లేదు.

## (3) సన్నివేశ కల్పనా శిల్పం

"కథలో జరిగే వాటికి అనుగుణమైన పరిసరాలను నేపధ్యాలను వాతావరణ పరిస్థితులను అత్యంత సహజంగా ప్రతీకాత్మకంగా చిత్రించడ మన్నది సన్నివేశ కల్పనా శిల్పం" 1 అని శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారు అభిప్రాయపడ్డారు.

కథలో జరిగే సంఘటనలపై పరిసరాల ప్రభావం తప్పని సరిగా వుంటుంది. కథానిక సాధ్యమైనంత క్లుప్తంగా చెప్పాలి కనుక ఈ పరిసరాల నేపథ్యం మొదలైనవి అనవసరంగా చిత్రించకూడదు. ప్రఖ్యాత కథకుడు ప్రకారం

"గోడకు వేలాడదీసిన తుపాకీని ప్రస్తావించి నప్పుడు
కథముగిసే లోగా ఆ తుపాకీ అవసరం రావాలి
లేనట్లయితే అది అనవసర చిత్రణే అవుతుంది" అంటాడు

పరిసరాల నేపథ్యాలు వాతావరణ పరిస్థితులు సహజంగానే కాక ప్రతీకాత్మకంగా కూడా వుండవచ్చు. ఈ ప్రతీకలవలన కథలోని వాతావరణం పాఠకునికి అర్థమవు తుంది. విషాద సంఘటనలను వర్ణించవలసివస్తే "ఆకాశం మేఘావృతమయిందని"

ప్రారంభించవచ్చు. అదే సంతోషకరమైన సన్నివేశాన్ని చిత్రించదలచుకుంటే వెన్నెల రాత్రిని ప్రతీకగా తీసుకొవచ్చును. అయితే ఈ ప్రతీకకు కథలో రాబోయే సంఘటనలకు అంతరసంబంధం వుండాలి.

కథలో వచ్చే పాత్రల బాహ్య అంతర స్థితులకు, సంఘటనలకు, సంఘర్షణలకు పోషకమైనది ఈ సన్నివేశకల్పనా శిల్పమే అందువలన సన్నివేశకల్పన చేస్తున్నప్పుడు పాత్రల మానసిక స్థితిగతులకు అనుకూలంగా చేయాలి. కాని ప్రతికూలంగా చేస్తే రసాభాస అవుతుంది.

1 తెలుగు కథానిక స్వరూప స్వభావాలు - పోరంకి దక్షిణామూర్తిగారు.

రాజారాం గారి కథల్లో పరిసరాల నేపథ్యం వాతావరణ స్థితిగతులు సహజ.గా ప్రతీకాత్మకంగా కనిపిస్తాయి. పాత్రల మనస్తత్వ చిత్రణ వారి బాహ్య అంతర సంఘర్షణల పోషణ రాజారాం గారి కథల సన్నివేశ కల్పనలో కనిపిస్తుంది. ఉదాహరణగా "రంగయ్య తమ్ముడు" కథలో ......

"సన్నగా వానచినుకులు పడుతున్నాయి. ముసార పట్టిన మాట నిజమే కానీ తెల్లవారిపూట వచ్చిన వాన కానీ బంధువు కానీ ఎంతోసేపు మకాం పెట్టడం జరగదన్న లోకోక్తి ఒకటి వున్నది. అయితే ఈ లోకానుభవానికి భిన్నంగా వాన తేపలు తేపలుగా మధ్యాహ్నం మూడు గంటల దాకా వస్తూనే వున్నది. సూర్యాస్తమయానికి కాస్తా తెరిపి. నిచ్చి వెలిసినట్టే తోచినా అర్ధరాత్రి లోగానే మళ్ళీ వర్షం ప్రారంభం కావచ్చు మల్లేశ్వరుడి గుట్ట మీద ఒక నల్లటి మేఘం అప్పుడే నడయాడుతున్నది.

కథ మొదట్లో ఈ వాతావరణ చిత్రణతోపాటు కథాయవనిక మీదికి ఒక వ్యక్తిని ప్రవేశపెడతాడు రచయిత అతడొక బైరాగి అతని వెంట భార్యా పిల్లలు వున్నారు. అతడు హస్త సాముద్రికం చెప్పి ఊళ్ళో మంచి పేరు సంపాదించుకుంటాడు ఎప్పుడో 30 ఏండ్ల క్రితం ఇంటిలో నుంచి పారిపోయిన రంగయ్య తమ్ముడే ఈ బైరాగి అన్న వార్త ఊరంతా పాకిపోతుంది ఒకనాడు అయితే ఇవి నిజమా కాదా అన్న విషయాన్ని రచయిత తేల్చి చెప్పడు.

ఈ సంఘటన వలన గ్రామరాజకీయాల్లో నివురుగప్పిన నిప్పు రాజకోవడం ప్రారంభమవుతుంది. రంగయ్య ప్రత్యర్థి రంగనాథం, రంగయ్య తమ్ముడి తరపున నిలబడి ఆస్తిలో వాటా కొరకు రెచ్చగొడుతువుంటాడు, రంగయ్య వర్గం వారు కూడా కయ్యానికి కాలుదువ్వుతూనే వుంటారు ఈ విధంగా గ్రామ వాతావరణం ముసారా పట్టినట్లు మారిపోతుంది.

జరుగబోయే సంఘటనలకు ప్రతీకాత్మకంగా కథ మొదట్లోనే ముసారా పట్టిన వాతావరణ చిత్రణ చేసి ఈ కథలోని సన్నివేశాన్ని సహజంగా చిత్రించాడు రచయిత

"జారుడు మెట్లు" కథలో............ ఈ కథలో కూడా వర్షం కురుస్తున్న రాత్రి వర్ణన జరిగింది. "బయట భోరున వర్షంపడుతోంది. ఇల్లంతా కురుస్తోంది. చిన్నా పెద్దా వంట పాత్రలన్నీ కురుస్తున్న ప్రదేశాల్లో పెట్టివున్నాయి. అక్కడ గోడనానుకుని ఒక స్త్రీ విషణ్ణ వదనంతో మూర్తీభవించిన శోకదేవతలాగా కూర్చున్నది. పెదవి కదిపితే మాటలే వస్తాయో కన్నీళ్లే వస్తాయో తెల్పడం కష్టం".

బయట ప్రకృతి భీభత్సం. లోపల ఆ స్త్రీ అంతరంగంలో చెలరేగుతున్న తుఫాను ను ప్రతీకాత్మకంగా ఈ సన్నివేశ కల్పన జరిగినట్లుగా అనిపిస్తుంది

నీలకంఠం అనే రచయిత మీది అభిమానంతో అతిన్ని కలుసుకోవడానికి వచ్చిన శ్రీపతికి నీలకంఠ ఇంట్లో క పి చిన దృశ్యమిది దారిద్ర్యానికి పరాకాష్ఠగా నీలకంఠం నట్టిల్లు కనిపించింది ఈ సన్నివేశ కల్పన ద్వారా కథకుడు రాబోయే కథాభాగంలో రచయిత యైన నీ·కంఠం హృదయ లో చెలరేగబోయే తుఫానుకు ప్రతీకగా చూపినా డని గమని-చ వచ్చు.

## 4. భాషాశైలి :—

"భాష్యతిఇతిభాషా, భాషవ్యక్తాయాంవాచి" భాషింపబడేది కాబట్టి దీనిని భాష అనే పేరువచ్చింది. 1

ప్రజ్ఞావంతుడయిన మానవుడు తన మనోగత భావాలను వ్యక్తీకరించడానికి అనువుగా తయారు చేసుకున్న ధ్వని రూపమైన సంకేతమే భాష. ఒకవ్యక్తి తాను వ్యక్తీకరించ దలచుకున్న భావాలను రెండో వ్యక్తి గ్రహించగలగడం ముఖ్యం. ఈ విధంగా ఒకవ్యక్తి చేత భావవ్యక్తీకరణం అతని ఎదుటి వ్యక్తి చేత భావగ్రహణం జరగడానికి సమానంగా ఉపయుక్తమయినప్పుడే భాష అనే సంకేతానికి పరమార్థం సిద్ధిస్తుంది.

ఈ భాషాభి వ్యక్తీకరణ వాచ్యంగా కాకుండా వ్రాత పూర్వకంగా వుంటే ఆ వ్యక్తీకరణ విధానంలో వుండే తీరును రచయిత "శైలి" అంటారు. దీనిని ఆంగ్ల పదమైన "Style" కు పమానార్థకంగా తెలుగులో వాడుతున్నారు.

"శైలి" శబ్దానికి "రచనా కౌశలముగల భాషా సౌష్టవము" అని శబ్దరత్నాకర కారుడు అర్థాన్నిచ్చాడు. Style శబ్దానికి బ్రౌను "Manner of writting with regard to Language" అనిఅర్థాన్నిచ్చాడు. భారతీయాలంకారికుల పదజాలంలో శైలి అనుమాట కానరాదు. దీనికి సమానమైన "శయ్యా" అను పదం వాడుకలో వున్నది.

---

1. భాషపుట్టు పూర్వోత్తరాలు—ఆర్. వి. శేషయ్య
తెలుగు బోధనా పద్ధతులు తెలుగు అకాడమి 1983.

"యా పదానాం పరా అన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే" పదాల మైత్రిని ఆలంకారికులు శయ్య అని నిర్వచించుట గమనించవచ్చును

పై నిర్వచనాలవలన సౌష్టవం గల భాషే శైలి అవుతుందని ఆ సౌష్టవం సిద్ధించడానికి నేర్పు కావలెనని శబ్దారత్నాకరార్థంలో స్పష్టమవుతున్నది. బ్రౌను పేర్కొన్న "ప్రత్యేక పద్ధతి" లో నైపుణ్యం ధ్వనిస్తున్నది. పదాల అన్యోన్య మైత్రికి కూడా కావలంది నేర్పే అన్నది స్పష్టవుతున్నది.

భాషాభి వ్యక్తీకరణ విధానం ద్వారా సద్భావ విన్యాసాన్ని ప్రత్యేకంగా పాఠకుడు గుర్తించే విధంగా రచయిత రాస్తాడు అంటే శైలిలో రచయిత ముద్ర వుంటుంది. పదాలు. వాక్యాలు, సామెతలు, ఇష్టమైన ప్రయోగాలు మొదలైన వాటిలో రచయిత అభిరుచి. ఆసక్తి ప్రతిఫలిస్తుంది. రచయిత ప్రాంతీయ మాండలికం భాషలో ప్రవేశించడం కూడా శైలిలో ఒక భాగమే అవుతుంది. శైలిభాషకు సంభంధించింది కనుక ఆ భాష అభివ్యక్తీకరణను బట్టి రచయిత ఎవరో పోల్చుకోవచ్చు శైలి రచయిత స్వభావాన్నీ, ప్రత్యేకతను సూచిస్తుంది. అందుకే

> " A Style must be individual, because it is
> the expression of an individual mode of feeling "

అంటాడు ముర్రే 1

తెలుగు కథా రచయితల్లో తమదంటూ ప్రత్యేకమైన శైలి వున్న రచయితలు అరుదుగానే వున్నారని చెప్పవచ్చు ఆటువంటి వారిలో మధురాంతకం రాజారాంగారు. ఒకరు,

రాజారాం గారి శైలిలో ప్రత్యేక్యంగా కనిపించేది ఆయన భాష రాయలసీమ మాండలికం ముద్రతో వుండి ఆంధ్రదేశంలోని ఏ ప్రాంతానికైనా ఆత్మీయంగా తోచే సజీవ వ్యావహారిక భాష

రాజారాంగారు పూర్తిగా చిత్తూరు మాండలికంలో రాసిన కథ ఒకటి కనిపిస్తుంది అజ్ఞాతవాసం) ఆ మాండలికంలో రాజారాంగారి తాదాత్మ్యం, దానిని నిర్వహించడంలో ఆయన చూపిన నైపుణ్యం ప్రశంసనీయాలు. ఉదాహరణకు ఆ కథలోని కొన్ని వాక్యాలు.

---

1 The Problum of style - Middleton Murray
London Oxford University Press

"అయ్యా, పెద్దాయనా! నువ్విక్కడుండావా సామీ . బస్టాండులో బిక్కరిస్తి. ఓటళ్ల కాడ గుక్కిళ్ళు మింగితి. అందరూ దీన్నేది టవును, టవును నాపాలిటికిది అడవైపోయ అయ్యా! అంటి. స్వామీ! అంటి దేవరా! అంటి నాగోడు ఇనిపించుకునే నాధుడే లేక పోయ........"

రాజారాంగారివి సామాన్య వాక్యాలు కాకపోయినా సాముదాయిక వాక్యాల్లోనే ఎక్కువగా కథనం జరిగినా సౌలభ్యం. ఋజుత్వం స్పష్టత తదితర లక్షణాలు ఆయన భాషకు ప్రత్యేకతను తెచ్చిపెట్టాయి ఈ కథల్లో ముఖ్యంగా ఉపమాలంకారాలు సామెతలు, భాషపై రచయిత కున్న మోజు. ఈ మూడి టిని గమనించాలి

(అ) ఉపమాలంకారాలు :- రాజారాంగారి కథల్లో ఉపమాలంకారాలు విస్తృతంగా కనిపిస్తాయి ఉపమ లేని వాక్యాలు చాలా అరుదు ఈ కథల్లో ఉపమాలంకారాన్ని రెండు రకాలుగా చూడవచ్చు

1 ఒక వస్తువును కాని వ్యక్తిని కాని ఉపమించవలసివస్తే సామాన్యంగా నిజ జీవితంలో కనిపించే పోలికలనే గ్రహించుట.

2. కథల్లోని పాత్రలకు పురాణాల్లోని ప్రాతలతో పోలిక చెప్పుట

ఈ రెండు రకాల్లో పురాణాల్లోని పాత్రలతో పోల్చడమే అధికంగా కనిపిస్తుంది ఈ పురాణ ప్రసక్తి కథలో సరిగ్గా సరిపోతుంది అందుకే రాజారాంగారి కథల్లో పురాణ ప్రసక్తిలేని కథ లేదంటే అతిశయోక్తి అనిపించుకోదు

మచ్చుకి నిజజీవితంలోని ఉపమాలంకారాలు ఈ క్రింది విధంగా కనిపిస్తాయి

"ఒకరి పాదాలను ఒకరు తోసుకొంటూ లాకుల్లోంచి ఈ వలికి వచ్చే నీళ్ళలా ప్రయాణికులు దిగుతున్నారు." (అద్వైతం)

"ఆమిద్దె పెచ్చులూడిపోయి సున్నానికి మొహం వాచినట్లున్న గోడలతో నిలువు దోపిడికి గురయిన అయినింటి ఆడపడచులా వుంది." (అప్పుల నరసయ్య)

"ఆచారి సన్నగా పసిరిక పాములా వుంటాడు." (అడిగిరాని వరాలు)

"అతడింట్లో వున్నంతసేపు మూలవిరాట్టుగానూ బయటకి వెళ్ళినప్పుడు ఉత్సవ విగ్రహం లాగానూ వుంటాడు."

"చిన్న పావడాపైన జానెడు జాకెట్టు తొడుక్కొని గొబ్బెమ్మ లాగా ముద్దొస్తుండేది ఆ పాప." (ఉద్యోగం)

"కొండరాతి దగ్గర ప్రవాహలంగా మా బాబాయి ముఖంలో ఆనందం నురగలు గక్కింది" (ఎదురుగాలి

"కండెనలేని బండి చక్రం గతుకుల బాటవెంట దొర్లినట్లుగా కాలచక్రం పరిభ్రమిస్తుంది" (కన్నెచెర

"తెల్లటిదుప్పటి పరిచిన పట్టెమంచంపైన తుంచి ఎండలో పారవేసిన అరటాకులా శోషిల్లి పడిపోయి వున్నరోగి" (దుష్టసమాస

"మాయా తివాచీలా దినపత్రిక నన్ను దేశం నలుమూలలా తిప్పింది" (పొద్దు చాలని మనిషి

"బకెట్లో గిన్నెలు కడుగుతున్నట్లు అతడు ఉద్వృతంగా నవ్వసాగాడు" (బ్రతుకనేర్చిన మనిషి

"ఏడాది పొడుగునా విరగబడిపూచే నిత్యమల్లి మొక్కలాంటివాడు వీరభద్రం" (బ్రతుకనేర్చిన మనిషి

"నల్లగా మాసిపోయిన దుస్తుల్లో బొగ్గుల్లో మునిగితేలిన ఇంజనులా కనిపించాడు శేషయ్య మామ" (మానవుడి విజయం

పురాణ పాత్రలతో పోలికలు మచ్చుకి కొన్ని ...

"మోస్తున్న వాళ్లను విస్మరించి క్రమబద్ధంగా ముందుకు కదులుతున్న కట్టెల మోపుల్ని మాత్రమే లెక్కకు తీసుకుంటే జనమేజయుని యజ్ఞకుండం లోకి దూకడానికి వెళ్లే సర్పకులాన్ని తలపింపజేస్తున్నాయి" (అడవిలో ధర్మదేవత

"రామదాసు స్టీరింగు చక్రం దగ్గర కూర్చుంటే ఋతుపర్ణుడికి నలుడు రథం తోలినట్లే" (అడిగిరాని వరాలు

"పచ్చటిచీరె తెల్లరవిక తొడుకున్న లీలావతి తామరాకు పొత్తర్లలో నారదమహర్షి దివినుండి భువికి తెచ్చిన పారిజాతపుష్పంలావుంది ఆమె" (ఎదురుగాలి

"బాబాయి ఉత్తరం బ్రహ్మాస్త్రమయితే అందుకు బదులుగా వచ్చింది బ్రహ్మశిరో నామకాస్త్రం" (ఎదురుగాలి

"పాదలేపనం ప్రవరాఖ్యున్ని తీసుకుపోయి మిన్నులు పడ్డచోట పారవేసింది. ఉద్యోగం మణవాళయ్యను తీసుకుపోయి మల్లెలమడుగు (గ్రామం) లో పారవేసింది. ఒక్కటే తేడా ప్రవరాఖ్యుడు అగ్నిదేవుని పుణ్యమా అని స్వస్థలానికి తిరిగి రాగలిగాడు. మణవాళయ్య మాత్రం తేనెలోపడ్డ ఈగలా మల్లెలమడుగులోనే వుండిపోయాడు" (గోదారి

"ఆతిథ్యం లభించనందుకు కినిసి కాశీనగరాన్ని శపించబోయిన దుర్వాసునికి అన్నపూర్ణ ప్రత్యక్షమైనట్లుగా తటాలున తలుపు తెరుచుకుంది" (తలుపులూ—తాళాలు)

"ఒంటిచక్రపు తేరికి ఏడు గుర్రాలను పూన్చి కుంతి సారథిని నమ్ముకొని ఆకాశ మార్గంలో పయనమైన సూర్యభగవానుడిలా కష్టనిష్టురాల మాటను లెక్క చెయ్యకుండా కారు నడుపుతున్నాడు శ్రీహరి" (తృప్తి)

"దుర్వాసున్ని వెంటాడే విష్ణుచక్రంలా నా ట్రాన్ఫరార్డరు తరుముకొచ్చేది" (ప్రజాపతి)

"బలిచక్రవర్తిని చూడడానికి వెళ్లిన రావణబ్రహ్మకు ద్వారందగ్గర కనిపించిన దివ్యమంగళ విగ్రహంలా వున్నాడాబంట్రోతు" (బ్రతుకనేర్చిన మనిషి)

"నిప్పులు చెరగిపోసే వేళల్లో మురళీకృష్ణకు ఆ గది ఆపత్సమయంలో సుగ్రీవుడికి ఋష్యమూకం వంటిది" (వగపేటికి చల్లచిందినన్)

"రామబాణంతో ఖండించబడి మళ్లీమొలచిన రావణాసురుని శిరస్సువలె రంగాపురంలో మళ్లీ స్కూలు వెలిసింది" (వెలుగు సముద్రంలో చీకటిదీవి)

"ఉద్యోగం మాయామృగంవలె దేశాలుతిప్పింది" (వెలుగు సముద్రంలో చీకటిదీవి)

ఈ విధమైన ఉపమాలంకారాలు రాజారాంగారి ప్రతి కథలోనూ చూడవచ్చు

**(ఆ) సామెతలు :—**

సామెతలు ఒకరు రచించినవి కావు ఇవి సమాజ సమిష్టి జీవనమథనంలో పేరిన మీగడవంటిది. నుడికారపు సొంపు తెలిసిన ఏ రచయితయినా సామెతలను తన రచనల్లో వాడుకోకుండా వుండలేడు. జనజీవనంలో కలిసిపోయిన సామెతలను సందర్భోచితంగా రచనల్లో వాడుకోవడంవలన సామెత వర్ణ్యవస్తువుకు సహాయకారిగా వుండి ఆ రచన పాఠకహృదయానికి హత్తుకోవడమనే ప్రయోజనాన్ని నెరవేరుస్తుంది

రాజారాంగారి కథల్లో అలంకారాల వలనె సామెతలు విస్తృతంగా కనిపిస్తాయి. ఒక సంగతిని శక్తివంతంగా చెప్పడానికి ఆయన సామెతను ఆశ్రయిస్తారు

ఆయన రచించిన ఇన్నూరు కథల్లో మున్నూటికిపైగా సామెతలను చూడవచ్చు. అసలు సామెతలేని కథ లేదనడం అతిశయోక్తికాదు. వాటిలో ప్రసిద్ధమైన సామెతలను వదిలి కొంత ప్రత్యేకంగా కనిపిస్తూ, రాయలసీమ జనజీవితానికి దగ్గరగా వున్నట్లుతోచే కొన్ని సామెతలను క్రింద ఉదహరిస్తున్నాను.

అప్పులేని గంజి అమృతం వంటిది (మిథ్య)
అమవాస్యతో కలిసివచ్చిన తద్దినంలాగా (జాగరూకుడు)
అరవై యేళ్లు దగ్గుస్తే అనులోమరులో (అడిగిరాని వరాలు)
అరవమొత్తుకోళ్లు ఇనుపగుగ్గిళ్లా ఒక్కటే (ఎండమావి)
ఆత్రగాడికి బుద్ధిమట్టు (వేదునిజం)
ఉడుముకు ఊళ్లో పెత్తనాలెందుకు (ప్రియబాంధవి)
ఊరివారిబిడ్డను నగరివారుకొడితే నగరివారి బిడ్డను నారాయణుడు కొట్టినట్లు (అడ్డుదారి)
ఎప్పుడు లేచినా రాళ్లవంక దగ్గరే తెల్లారినట్లు (జారుడుమెట్లు)
ఒక ఊరి మగోడు మరో ఊరి పసల పాలిగాడు (ఫలితం)
కొండగొర్రెను తోలుకొచ్చి సంతలో తోలినట్లు (అజ్ఞాతవాసం)
గంగలో మునిగి కొల్లేరులో తేలినట్లు (పొద్దుచాలని మనిషి)
గాజుల బేరం భోజనానికి సరి (ధర్మగ్లాని)
చేతికందిన కబళం నోటి కందక పోవచ్చు (అడవిలో ధర్మదేవత)
నక్క ముదిరితే నరుడవుతుందిట (అజ్ఞాత వాసం)
పెదవిదాటిన కబురు పెన్న దాటుతుందిట (సంఘ జీవి)
బెస్త వీధిలో పువ్వుల దుకాణం పెట్టినట్లు (హాలికులు కుశలమా)
బోడి నెత్తికీ బొటన వేలికి ముడిపెట్టినట్లు (వ్రత భంగం)
మూసిన ఇంట్లో ముంత పొగ పెట్టినట్లు (ఎమర్జెన్సీ)
మట్టి గుర్రాన్ని నమ్మి గోదార్లో దిగినట్లు (మయసభ)

## (ఇ) తెలుగు భాషపై రచయితకున్న మోజు :—

రాజారాంగారు భాషలో కూడాతెలుగుదనాన్ని ప్రేమిస్తారు. అక్కడక్కడ అ... వార్యంగా ఆంగ్ల పదాలు వాడినా చాలా చోట్ల ఆంగ్ల పదాలకు అనువాదప్రాయమై... తెలుగు మాటలు ప్రయోగించ వలెనన్న పట్టుదల కనిపిస్తుంది. అయితే ఈ అడు... దాలన్నీ ఉత్తమ పరిభాషగానో, సాంకేతిక పదాలుగానో, పారిభాషిక పదాలుగానో ని... పడతాయా? అనేవి చికిత్స చేయడం కన్నా దాని వెనక రచయితకున్న తెలుగు భాష... మానమే గమనార్హం. ఉదాహరణగా....

| ఆంగ్లపదం | దానికి అనువాద ప్రాయమైన తెలుగుమాట | కథపేరు |
|---|---|---|
| స్విచ్ | ఖిస, మీట | సర్కసు డేరా |
| ఎలెక్ట్రిక్ లైట్ | విద్యుద్దీపము | ఎదురు గాలి |
| ఫ్యాన్ | విద్యుద్వీవన | పాంథ శాల |
| కరెంట్ | విద్యుత్ ప్రవాహం | పాంథ శాల |
| మైక్ | శ్రవణ విస్తరణ యంత్రం | సన్మానం |
| సిగ్నల్ | రెక్కమాను | ధర్మగ్లాని |
| హోటల్ | కాఫ్యాలయం | మిస్ మరీచిక |
| లాడ్జి | బంధుగృహం | అనివార్యం |
| మోటార్ సైకిల్; సైకిల్ | ద్విచక్ర శకటం | వక్రగతులు |
| టార్చి లైట్ | కందీపిక | వక్రగతులు |
| రిస్ట్‌వాచి | ముంజేతి గడియారం | వక్రగతులు |
| గైడ్ | మార్గదర్శి | ప్రజాపతి |
| ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ | పరుపులపెట్టె | వ్యాసం |
| ఇంక్‌పెన్ | ఊటకలం | పునర్నవం |
| ఇంజెక్షన్ | నూదిమందు | ప్రాణదాత |
| ఫైవ్‌స్టార్ హోటల్ | పంచ నక్షత్ర హోటల్ | భూమార్గం |

## 5 వర్ణనలు

వర్ణన కథాకథనంలో అంతర్భాగంగా వుంటుంది. కథలోని పరిస్థితులకు లేదా మనోభావాలకు అనుగుణంగా రూపొంది కథను పరిపుష్టం చేస్తుంది. వర్ణన వలన ఆయా విషయ లేదా వస్తుగుణం అనేక కోణాల్లో ప్రకాశిత మవుతుంది. అందుకే "కథలోని వర్ణనలు వస్తు వర్ణనకు, రూప వర్ణనకు, భావ వర్ణనకు సంబంధించి వుంటాయని, సామాన్యంగా ఈ మూడింటిని వర్ణనలనే వ్యవహరిస్తారని" ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు అభిప్రాయ పడినారు [1]

(అ) వస్తువర్ణన ;- ఇతివృత్తానికి వస్తువుకు సంబంధించిన అంశాలను కథానుగతంగా వర్ణించడం వస్తువర్ణన. సందర్భానుసారంగా ప్రాకృతిక దృశ్యాలు, స్థలాది వర్ణనలు అవుతాయి.

ఉదా॥ "మమకారం" కథలో మేష్టారు అత్యవసర పరిస్థితుల్లో ఒక పల్లెటూరు వెళ్ళవలసి వుంటుంది. ఆవూరికి వెళ్ళే బస్సు.........

1. ఆంధ్రసాహిత్య చరిత్ర - పింగళి లక్ష్మీకాంతంగారు

"చావు దప్పి కన్నులొట్ట పోగా యుద్ధరంగంనుండి పారిపోయి వచ్చిన క్షత గాత్రుడిలా వుంది" అని బస్సు బాహ్యరూపాన్ని వర్ణించి అబస్సులో ప్రయాణం చేస్తున్నపుడు కనబడ్డ దృశ్యాలను ఈ విధంగా వర్ణిస్తాడు

"తుమ్మ చెట్లు ముళ్ళ కంపలు బలిసి పోయిన పోరంబోకు బీళ్ళు నిగనిగల కరవాలపుటంచు వంటి నీరెండలో మలుపు తిరిగి పోతున్న మట్టి బాటలు. పల్లెరేగడి చేల మధ్య కనుమల్లో రక్తం గడ్డ కట్టినట్లున్న పువ్వులతో కిక్కిరిసిన మోదుగా చెట్లు ... ఉప్పుదిని పోతున్న గోడలతో కప్పెగిరి పోయి వెదుళ్ళు పైకి కనిపిస్తున్న పూరిగుడిసె లతో నవనాగరికతకు దూరంగా విసిరి వేయబడినట్లు చింత చెట్ల కింద బిక్కుబిక్కు మంటున్న పల్లెటూళ్ళు"

ఈ విధంగా సాగిన వస్తు వర్ణనలో పాఠకుడు బస్సులో ప్రయాణిస్తున్న అను భూతిని పొందుతాడు

చేదు నిజం కథలో..."సూర్యుడస్తమించాడు చీకట్లు మెల్లమెల్లగా ముసురుకో నుంకిస్తున్నాయి దూరంగా పర్వతాలు గాంభీర్యాన్ని వెలార్చుతూ నిల్చున్నాయి అకల్లాడని ప్రకృతి నిలబెట్టిన చిత్తరువులావుంది తలుపులు బిగించి కిటికీలు మూసి వేసిన మహాసౌధంలా బ్రహ్మాండం స్తబ్దతకు నిలయమై పోయింది."

ఈ విధంగా వర్ణన వస్తువును అతివృత్తాన్ని ప్రకాశమానం చేస్తుంది.

(అ రూప వర్ణన :- కథలోని పాత్రల మనస్తత్వ చిత్రణతో పాటు రూపచిత్రణ కూడా సమగ్రంగా సహజంగా చేయడంవల్ల ఆపాత్ర పాఠకుని మనస్సులో ముద్రించుకు పోయే అవకాశం వుంది. రూపు రేఖలు కట్టూబొట్టూను సవివరంగా వర్ణించడం వల్ల పాత్ర రూపం పాఠకుని మనోనేత్రం ముందు ప్రత్యక్షమై కథలో మమేకం కావడానికి వీలవుతుంది. రూపవర్ణన రచయిత పరిశీలనా శక్తిపై ఆధారపడి వుంటుంది.

రాజారాంగారి కథల్లో వచ్చే ఉపాధ్యాయులు, గుమాస్తాలు అటెండర్లు ప్రత్యేకంగా కనిపిస్తారు. ముఖ్యంగా రాజారాంగారు చిత్రించిన ఉపాధ్యాయులు ఆర్. కే. లక్ష్మణ్ సృష్టించిన కామన్ మ్యాన్ వంటి ప్రత్యేక తరహాకు చెందిన వారివలె కనిపిస్తారు.

"హాలికులు కుశలమా" అనే కథలో ఒక పాతకాలం ఉపాధ్యాయుడుండాడు. అతనిపేరు రాయదుర్గం నరప్ప పంతులు అతని రూపవర్ణన ఈ విధంగా సాగుతుంది.

" ఉన్నత పాఠశాలలో అతన్ని మొదటి సారి చూసినప్పుడు ఆయన అక్కడి తెలుగు పండితుడని తెలియదు కోరమీసాలు పద్ధతి లేకుండా కట్టుకున్న తలపాగా, పొడుగాటి కోటు మెడకు రెండు చుట్లు తిరిగి ఇరువైపులా కిందికి వేలాడుతున్న అంగవస్త్రం పాదాలకు కిర్రు చెప్పులు పండితుడైతే అయ్యాడు గాని అందుకు తగ్గ

వేశాన్ని మాత్రం సంతరించు కున్నట్లు లేదు ఆయన వరసలో ఎద్దుల బేరగాడిలా వున్నాడు బటవాసంచి భుజానికి తగిలించుకొని సంతకు వెళుతున్న పెద్దకాపులా వున్నాడు "

క్రూర ఉపాధ్యాయులను మినహాయిస్తే రాజారాంగారి కథల్లోని ఉపాధ్యాయు లందరు దాదాపు ఈ నరసప్ప పంతులుగారి వలెనే వుంటారు "బొద్దు మీసాలతో ఎర్రటి కళ్లతోను పెద్దపులిలా కనిపించే హెడ్మాస్టరు బలరామయ్య గారిది" (మెత్తని పులి) ఇటు వంటి రూపచిత్రణే, సరిగ్గా ఇటువంటిదే అయినా శాతంగా వుండే పార్థ సారధి మేష్టారుగారి పాత్ర "చేత గొడుగుతో, పొడుగాటి కోటుతో, తెల్లటి తల పాగాతో చిరునవ్వులు మెరుగులు దిద్దుతున్న నెరసిన మీసాలతో" ప్రాణదాత కథలో దర్శన మిస్తుంది

రాజారాంగారి కథల్లోని అటెండర్ల రూపచిత్రణ ఈ విధంగా వుంటుంది.

నాగులయ్య అనే అటెండరు 'దారితోడు' కథలో కొండలరావుగారికి ఈ విధంగా కనిపిస్తాడు 'కొండదిగి వచ్చాడేమో నున్నటి బోడిగుండుకు తువ్వాలు చుట్టుకున్నాడు కిపాను పెట్టి మోకాళ్ళ దాకా చుట్టుకున్న పంచకట్టు పైన అరచేతుల చొక్కా తొడు క్కునాడు మెడలో తాయత్తు ముంజేతికి రాగి కడియం ........' ఈ విధంగా సాగి పోతుంది

ఉపాధ్యాయులు అటెండర్లే కాకుండా రాజారాంగారి కథల్లో ఖాకీ దుస్తులకు తోడు తలచుట్టూ ఒక మఫ్లర్ కూడా చుట్టుకొని ఎస్కిమో వాడిలావున్న కండక్టరు (శేషయన్న) కాలుతూ కాలుతూ వుండి వానలో తడిసి ఆరిపోయిన తుమ్మ మొద్ద లాంటి దొంగ (రైలు ప్రయాణం) పొడుగ్గా కాయవాటుగా కళ్ళద్దాలతో కోర్టు అమీనా వంటి ఆసామి వ్యాపకం) వెలుగుతున్నా పొగరెక్కువ వెలిగక్కుతున్న నూనె దివిటీ వంటి పెద్ద మనిషి (రేపటి ప్రపంచం) తుఫానులో తడిసి ముప్పందుమైపోయి చేని గట్టు మీద వడవడా వణికిపోతున్న గరుడ పక్షిలా ఒంటి చిందుకూ దుప్పటి కప్పుకొని లోతుకు పోయిన కళ్ళతో బిక్కుబిక్కుమని చూస్తున్న మాధవయ్య మామ (వైరాగ్యంతో సరాగం) పాలుగారే చెక్కిళ్ళు, మెరిసే కళ్ళు పగడాల్లావున్న బుల్లి పెదవులు, అమాయ కత్వం ఉట్టిపడే ముఖం మునిమాపు వేళ ఇంటి ఇల్లాలు నట్టింట వెలిగించిన దీపకళి కల వంటి పసిపిల్లలు (రేపటి ప్రపంచం) చేమంతి పువ్వుల పోగువులా పసిమి నిగ్గులతో మెరుస్తున్న నడుచు కుర్రవాళ్లు (ఎక్కువలసిన రైలు) మొదలైన రూపాలు రాజారాం గారి కథల్లో సజీవంగా ప్రత్యక్షమవుతాయి

పైన చెప్పిన వ్యక్తి చిత్రణలతో పాటు రాజారాంగారి స్త్రీరూప చిత్రణ సహజ సుందరంగా వుంటుంది అనడానికి చాలా ఉదాహరణలు ఇవ్వవచ్చును. కంట్రాక్టరు చంద్రారావుగారి భార్య రమాబాయిని గురించి వ్యాఖ్యాన సహిత వర్ణన......

"కట్టుకున్న పట్టుచీర సంపన్నతకు గుర్తు, అది ముదురు ఆకు పచ్చరంగులో వుండుట అభిరుచుల తీవ్రతకు దాఖలా, పువ్వులు మొగ్గలు ఆ చీరలో కిక్కిరిసి వుండుట సాదాతనం పట్ల ఆమెకు గ వైముఖ్యానికి సూచన. ఇంక నగల నిగారింపు గురించి చెప్పనే అక్కర్లేదు మొత్తం మీద తన గురించి ఇతరులు పరిచయం చేయ వలసిన అవసరం లేకుండా తన వేషమే ఆపని చేయగలిగేటట్లు ఆమె జాగ్రత్త తీసుకున్నదని మాత్రం ఒప్పుకోవచ్చు. (ద్వంద్వ సమాసం)

ఒక్కొక్క చోట స్త్రీరూప వర్ణనతో పాఠకుడికి ఆ పాత్రపట్ల పూజ్యభావం కలిగే విధంగా చిత్రించడం కనిపిస్తుంది.

"ఆకుపచ్చ సిల్కుచీరె తలలో చేమంతి పువ్వులు, నుదుట కుంకుమ బొట్టు దేహచ్ఛాయలో గలిసిపోతున్న సువర్ణాభరణాలు పలుకరిస్తూ ఆమె దగ్గరికి వస్తూ వున్నది." (వ్యవస్థ)

ఈ విధంగా రాజారాం గారి కథలో పాత్రల రూప చిత్రణ సహజసుందరంగా వుండి వాటి మానసిక స్థితిగతులను పాఠకులకు వివరంగా తెలుపుకుంటాయి.

<u>(ఇ) భావవర్ణన :-</u> పాత్రల మనస్సులో చెలరేగే భావాలకు అక్షర రూపం కల్పించడం భావ వర్ణన అవుతుంది. అవి ప్రతీకాత్మకంగా కూడా వుండవచ్చును. పాత్రల భావోద్రేకాలు ఆనందం, ఆవేదన, ఆశ్చర్యం అసూయా ద్వేశాలు ప్రేమ అనురాగం మొదలైన భావాలను ఈ వర్ణన ద్వారా చిత్రించవచ్చును

రాజారాం గారి కథల్లో చాలా మట్టుకు ప్రథమ పురుష కథలే వున్నాయి కాబట్టి ఈ పాత్రల మనస్సులోని భావాలు పాత్రలే ప్రకటితీచుకుంటాయి. ఉత్తమ పురుష కథలో రచయిత పాత్రగావుంటాడు కనక భావోద్రేకాలను తానే పాఠకులకు తెలియ జేస్తాడు.

ఉదా॥ 'కమ్మతెమ్మెర' కథలో శేషాద్రి అనే ఒక పెళ్ళికొడుకు గుర్రం మీద కూర్చు న్న దగ్గరి నుండి మొదలై పెళ్ళయ్యే వరకు ఒకటే సంఘటనగా జరిగిన శేషాద్రి ఊహలే ఈ కథగా రూపొందాయి. శేషాద్రి భావోద్వేగాల వర్ణన . . . . కుమారు నికి పెళ్ళికావడం మంటే అతడి పట్ల తనకున్న బాధ్యతలు పెక్కింటిని తల్లికోడలికి అప్పజప్పడమన్న మాట ఆ బాధ్యతల్ని కోడలి ఎంతవరకు సక్రమంగా నిర్వహించ గలదన్న ప్రశ్నకు కాలమే జవాబు తేల్చి చెప్పవలసి వుంటుంది. కార్యేషుదాసీ కరణేషు మంత్రి అంటూ భర్తృహరి సహధర్మిణికుండవలసిన గుణాలను ఏ కరువు పెట్టాడు. ఆ లక్షణాలను మననం చేసుకున్నప్పుడు అనుకుల అనుకూల దాంపత్యం భగవంతుడు ప్రసాదించవలసిన వరమనిపిస్తుంది.

ఈ విధంగా సాగిన శేషాద్రి ఊహల్లో అతని భావోద్వేగాలు ప్రతిఫలిస్తున్నాయి.

## 6. శీర్షిక :-

శీర్షిక కథన శిల్పం ఇతివృత్తాలతో ముడివడి వున్నదే కాని ప్రత్యేక అస్తిత్వంకలది కాదు. కథకు శీర్షిక అందమైన ముఖానికి తిలకం వంటిదని చెప్పవచ్చు.

కథకు శీర్షిక ఎన్నుకోవడంతో రచయిత దృక్పధం పాఠకుని తెలుస్తుంది. కథలోని విషయాన్ని ధ్వనిరూపకంగా కథా శీర్షికను ఏర్పరచవచ్చు. ఈ ధ్వని కథలోని ఇతివృత్తానికి సంబంధించినదై వుండవచ్చు లేదా ఏదో ఒక పాత్రకు సంబంధించిందై వుండవచ్చు ఇటువంటివేమీ లేకుండా వృత్తాన్ని సూచించే ఒక సామెతనో, లోకోక్తినో, పద్యపాదాన్నో, కథానామంగా వాడుకోవడం కూడా గమనించాలి. మహాకవుల ప్రసిద్ధ ప్రయోగాలుకూడా కథా నామాలుగా కనిపిస్తాయి. అయితే కథకూ శీర్షికకు కార్యకారణ సంబంధంలేని కొన్ని ఆధునిక కథానికలను గమనించవచ్చు.

సాధారణంగా నవలలలో ప్రధాన పాత్రలేదా కథా నాయిక పేరుతో నవల జరుగుతుంది, అక్కడక్కడా కథల్లో గూడా ఇటువంటి పద్ధతి కనిపిస్తుంది తొలి తెలుగు కథానిక "దిద్దుబాటు"ను గురజాడ అప్పారావు గారు వ్యావహారికంలోకి తిరిగ రాసి దాని శీర్షిక ఆ కథానాయిక యైన 'కమలిని' అని వ్యవహరించుట గమనించ వలసిన విషయం.

రాజారాంగారి కథలు కథకూ, శీర్షికకు కార్యకారణ సంబంధం కలిగి వుంటాయి. శీర్షికకు కథ సరిగ్గా సిరిపోతుంది. అందుకే పోరంకి దక్షిణామూర్తిగారు తమ సిద్ధాంత వ్యాసంలో రాజారాంగారు శీర్షికల గురించి ప్రస్తావిస్తూ "తాను వెలించిన దీపాలు" అన్నది రాజారాంగారి రాసిన ఒకకథపేరు అందులో ప్రధాన పాత్ర ఒకరిటైరైన బడిపంతులు. ఆయన దగ్గర చదువుకున్న పిల్లలే చిట్టిచిట్టి దీపాలు"

శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారి మాటలు సత్యమని నిరూపించుటకు ఈ క్రింది ఉదాహరణలు చూపవచ్చును.

ఈడూజోడూ కుదిరినా మనస్తత్వాలలో బేధాలు వచ్చి తప్పనిసరై సంసారం చేస్తున్న హెడ్‌మిస్ట్రెస్ ప్రమీలాదేవి. ఆమె తాగుబోతు భర్తవారిద్దరి దాంపత్య జీవితాన్ని ప్రతీకగా తీసుకున్న రాజారాంగారి కథపేరు "దుష్టసమాసం"

రాజారాంగారి కథా శీర్షికలు ధ్వని మంతగా వుంటాయనడానికి ఈ క్రింది ఉదాహరణ చూపవచ్చు. జీవితమంతా అదే ఊరికోసం ధారబోసుకున్న మణవాళయ్యకు చివరికి అదే వూళ్ళో నిలువ నీడలేక పోగా ఊరికి బాకీదారుడుగా తేలిపోవడంతో పలాయనం చిత్తగించిన మణవాళ్ళయ్య మేష్టారి కథపేరు 'గోదారి' అని పెట్టడంలో ఏదారీలేని మేష్టారు జీవితమే ప్రతీకాత్మ కధ్వని.

అయితే కొన్ని కథల పేర్లు చమత్కారంగా వుండుట గమనించాలి. తెలుగు వాతావరణాన్ని వదిలి ఆకాశయానం చేస్తున్న తెలుగు కథారచయితలను భూమార్గం లోకి రమ్మని ఆహ్వానించే కథ పేరు 'భూ మార్గం'

కలం స్నేహంలో పేహ్యం వుండదనే సందేశాన్ని అందజేస్తున్న కథ ఖాళీ ఘటా నీళ్ళులేని మేఘమకి అర్థంతో ఈ కథ రాయబడింది,

తెలుగు కథల శీర్షికలు తెలుగులోనే వుండవలెనన్న నియమమేమీ లేదు. కనుక రాజారాంగారి కథ పేర్లు తెలుగుతొ పాటు సంస్కృత హిందీ ఇంగ్లీషు భాషల్లో వుంటాయి.

లేదా యదతథంగా పద్యపాదాన్నో లేదా శ్లోక పాదశకలాన్నో కథా శీర్షికగావాడు కున్న సందర్భాలు కనిపిస్తాయి.

1. వగపేటికి చల్ల చిందిన్
2. కాటుక కంటి నీరు
3. ముదితల్ నేర్వగరాని విద్య మొదలైన వద్యపాద శకలాలు

1. వజ్రాదపి.........
2. స్త్రీణాంచ చిత్తం పురుషస్యభాగ్యం, మొదలైన శ్లోక పాదశకలాలు.

1 ఎమర్జెన్సీ
2. కార్టూన్
3. గ్రూఫ్‌ఫోటో
4. బెరామీటరు
5. సర్వీసు రిజిష్టరు
6. స్పాట్‌లైట్
7. లెస్ లగేజ్ మోర్ కంఫర్ట్

మొ॥ ఆంగ్ల భాషా శీర్షికలతో పాటు "ఖాళీఘటా" అనే హిందీ శీర్షికకూడా కనిపిస్తుంది

ఈ విధంగా రాజారాంగారి కథలకు కథా శీర్షికకు కార్యకారణ సంబంధం వుంటుంది అనుట నిర్వివాదాంశము.

## 7. ఎత్తుగడ :—

పూర్వం కథలు అనగనగా రాజుతో ప్రారంభమయ్యేవి. కానీ ఆధునిక కథానిక ఎక్కడినుండయినా ప్రారంభం కావచ్చు. ఎత్తుగడ ఎక్కడ ప్రారంభమయిందో మళ్ళీ అక్కడికే వచ్చి కథ ముగించాలని కొందరు కథకుల అభిప్రాయం. ఎక్కడ మొదలైనా కథ ప్రారంభం కాగానే పాఠకుణ్ని కథలో ప్రవేశింపజేసి పఠనోన్ముఖం చేసే శక్తి ఎత్తుగడలోనే వుంటుంది. అప్పుడే కథ సార్థకమవుతుంది.

రవీంద్రనాథఠాగూర్‌గారు ఒక కథ వ్రాస్తూ "సుభాషిణి అనే పేరుగల అమ్మాయి మూగదవుతుందని ఎవరికి తెలుసు" అంటూ ప్రారంభిస్తారు. ఈ ఎత్తుగడ చాలా మంది పండితుల మెప్పుపొందింది. ఈ వాక్యం వెంటనే కథపై పుపఠితను లాక్కుంటుంది. అంతేకాక అది సుభాషిణికి సంబంధించిన కథ అని కూడా సూచిస్తుంది.

కథానికలో ఆద్యంతాలకు అభేయ సంబంధం ఉంటుందనీ అంతం ప్రతి పాద్యమయితే ఆరంభం పూర్వపీఠిక అనీ అంతంలో చెప్పేదానికి ఆదిలోనే భూమిక స్థాపితం అవుతుందనీ జగన్నాధ్ ప్రసాద్‌శర్మ పేర్కొన్నాడు. 1

శర్మ గారి దృష్టిలో నాలుగు రకాల ఎత్తుగడలున్నాయి.

1. నాటకియ ఆరంభం - సంభాషణలతో కథ ప్రారంభం అవుతుంది.
2. ఆరంభిక చిత్ర విధానం - కళ్లకు కట్టినంత వివరంగా వర్ణనలతో కథ ప్రారంభమవుతుంది.
3. ఇతివృత్తాత్మక ఆరంభం - ఇతివృత్త వివరణతో కథ ప్రారంభమవుతుంది.
4. కుతూహల పూర్ణ ఆరంభం - కథలో ముందు కరుగబోయే దానికి ఉత్కంఠను పుట్టించడం లేదా ఆశ్చర్యాన్ని కల్గించడం జరుగుతుంది.

ఈ నాలుగు రకాల ఎత్తుగడల్లో సామాన్యంగా ఇతివృత్త సంబంధిత వర్ణనతో ప్రారంభమయ్యే కథలు ఎక్కువగా కనిపిస్తాయి. ఈ అభిప్రాయంతోనే తెలుగు కథానికల్లో మూరు రకాల ఎత్తుగడలుంటాయని శ్రీ శొంఠి కృష్ణమూర్తిగారు నిర్వచించారు.

---

1. కథానికా రచనా విధాన్ — హిందీప్రచారక్ పుస్తకాలయ్, వారణాశి. శ్రీ జగన్నాధ ప్రసాద్ శర్మ – 1961.

1. క్రియాత్మక రూపంలో గాని సంఘటనల రూపంలోగాని కథను ప్రారంభిస్తే నెరేటివ్ హుడ్ (Narrative hood) బాగా వుంటుంది.

2 సంభాషణలతో కథను ప్రారంభిస్తే పాత్రల మనోభావాలను స్పష్టపరచవచ్చు. కథాగమనానికి కథాంశాన్ని తెలుపడానికి అవి తోడ్పడతాయి.

3. ప్రస్తావనతో ప్రారంభించడం. పాత్రచిత్రణకి వాతావరణానికి ఈ పద్ధతి వీలుగా వుంటుంది. అని పై మూడు రకాల ఎత్తుగడలను శ్రీ కొంరి కృష్ణమూర్తి గారు నిర్వచించారు. 2

రాజారాం గారి కథల్లో ఈ మూడు లక్షణాలు కథా ప్రారంభాలకు వర్తిస్తాయి కానీ రచయిత కథలో ప్రవేశించకుండా ఉత్తమ పురుషలో చెప్పే కథలే అధికం కనుక ఒక వ్యక్తిని గాని ఒక సంఘటనను గాని ముందుగా వివరించడం ఈ కథల్లో ఎక్కువగా కనిపిస్తుంది.

శ్రీ కొంరి కృష్ణమూర్తి గారి ప్రకారంగా రాజారాం గారి కథలు ఈ విధంగా ప్రారంభమవుతున్నాయి.

(అ) క్రియాత్మక లేదా సంఘటన రూపంలో ప్రారంభమయ్యేవి :—

'జారుడు మెట్లు' ఒక రచయిత కథ. ఆరంభంలో "ఈ కథకు బీజం ఒకానొక మానవుడి సదుద్దేశం. అతని పేరు శ్రీపతి" అంటూ ప్రారంభమైన కథలో శ్రీపతి ఒక సంఘటనకు కారణమై కథలో అనుకోని మలుపుకు కారణమై అదృశ్యమవుతాడు. కథ చివరి వరకు శ్రీపతి మళ్ళీ కనిపించడు.

అదేవిధంగా 'సంఘజీవి' కథ ఈ విధమైన ఉపోద్ఘాతం తో ప్రారంభమవుతుంది "మంచి కబురు కానివ్వండి అది చెడ్డ కబురు కానివ్వండి పెదవి దాటింతర్వాత అది పెన్నునే లంఘించ గలదంటారు

(ఆ) సంభాషణలతో ప్రారంభమయ్యేవి :—

'సర్వీసు రిజిస్టర్' కథ ప్రారంభం "ఇదిగో రామన్నా బుద్ధుందా నీకు? నేను చెప్పిందేమిటి? నువ్వు చేసిందేమిటి?".

---

2. కథలు రాయడం ఎలా ? కొంరి కృష్ణమూర్తి. యశోదర ప్రచురణలు — వరంగల్ 1955.

"మీరు చెప్పే దేనండమ్మ గారు! పరుపులు తీసి ఎండలో వేయమన్నారు. వేయ బోతుంటగా మళ్లీ వేసుకోవచ్చు గాని బజారుకెళ్ళి తల నూనె బుడ్డి తీసుకు రమ్మ న్నారు.?"

"కుంపట్లో కుసుమం" కథ ఈ విధంగా ప్రారంభమవుతుంది. "ఏమిటోయ్ అహమద్ ఈ వేళ ఎంతకూ ఇండి స్పీడ్ అందుకోవడం లేదే! అవతల నాకు బోలె డన్ని పనులున్నాయి." అన్నాడు వెనక సీటుకు చేరగిలబడి సిగరెట్టు కాల్చు కుంటున్న వజ్రపాణి.

"ఎక్కడో మిషన్ కొంచెం చెడిపోయినట్లుందండీ! అయినా ఇంకెంత దూరం దరిదాపుకు వచ్చేశాం" అన్నాడు డ్రైవర్.

(ఇ) ప్రస్తావనతో ప్రారంభమయ్యేవి:—

"చేదునిజం" కథా ప్రారంభం......

"సమయం పొద్దు గూట్లో పడుతున్న వేళ. పట్టణాని కవతల వున్న నదీతీరం.

స్థలం పైన వినీలాకాశం. ఎదుట నదీతీరం" ఈ విధమైన వాతావరణ స్థల వర్ణనతో కథ ప్రారంభమవుతుంది.

"రంగయ్య తమ్ముడు" కథ ప్రారంభం.....

"పొద్దుపోయి రెండు ఘడియలయింది. చీకటి పడుతూవుంది. ఆకాశాన దూది పింజల్లాంటి మబ్బులు నడయాడుతున్నాయి. ఇప్పుడిప్పుడే వానపడే సూచనలు లేవు"

ఈ విధమైన అరంభాలతో పాటు ఒక సామెతను చెప్పి కథను ప్రారంభించి దాని కనుగుణంగా కథను అల్లుకుంటూ పోవడం కూడా రాజారాం గారి కథల్లో కనిపిస్తుంది.

"ఒక ఊరి మణెగాడు మరొకఊరి వనల పోలిగాడు" అని ప్రారంభమయ్యే ఒక రీసెర్చి స్కాలరు కథ ఎన్నతగినది. కథ పేరు ఫలితం.

పై వాటిల్లో సంభాషణలతో ప్రారంభమయ్యే కథలు ఫ్లాష్‌బ్యాక్ కథలుగా మారే అవకాశం వున్నది. సమయ సందర్భాలను ప్రారంభంలో చెప్పిన కథలు పురాణాలలో వలె కథాప్రారంభం కావడం గమనించ వచ్చు. సామెతలతో ప్రారంభమైన కథలు రచయిత లోకజ్ఞతకూ పరిశీలనా శక్తికి సంబంధించినవిగా చెప్పవచ్చు.

## 8. ముగింపు :—

ఏక సూత్రంగా సాగిన కథ నిలిచి పోయిన స్థానమే ముగింపు. ఒకరకంగా కథ ముగింపుతోనే ప్రారంభమవుతుందని కొందరి అభిప్రాయం.

ఈ ముంగిపు రెండు రకాలు.

(అ) తరంగ పద్ధతిలో ముగింపు

(ఆ) నిశ్చలంగా లేదా భావస్ఫోరకమైన ముగింపు

(అ) తరంగ పద్ధతి:— ముగింపు వాక్యం ఒకానొక మౌలికాంశాన్ని వెలుగులోకి తెస్తుంది. దానితో ఒక్కొక్కప్పుడు అంతకు ముందు జరిగిన కథంతా మారి పోతుంది. కథాంతంలో కళ్ళు మిరుమిట్లు గొలిపే సత్యం దృగ్గోచర మవుతుంది. అదే తరంగం.

మపాసా కొన్ని కథల్లో ఈ పద్ధతిని అనుసరించాడు. ఓ హెన్రీ ఇందులో సిద్ధ-హస్తుడు అనిపించుకున్నాడు అయితే ఓ హెన్రీ దీంట్లో చాలామట్టుకు భావస్ఫోరకంగానే వాడుకున్నాడు. ఓ హెన్రీ ముగింపులకు కొసమెరుపు అని పేరు వచ్చింద.

(ఆ) నిశ్చల లేదా భావస్ఫోరక పద్ధతి :- ఈ పద్ధతిలో ముగింపు కొసమెరపును ఆశ్రయించకుండా భావస్ఫోరకంగా వుండి నిశ్చలత్వాన్ని ప్రదర్శిస్తుంది.

అయితే పాఠకున్ని ఆశ్చర్యంలో ముంచెత్తడం ప్రతి కథలోనూ సాధ్యం కాదు ముగింపు ఎలా వున్నా, ముగింపు వలన పాఠకున్ని కొంచెం సేపు కథ గురించి ఆలోచింపచేయగలగాలి. అప్పుడే అది మంచి ముగింపు అనిపించుకుంటుంది.

"తెలుగు కథా రచయితల్లో చక్కని ముగింపులతో రాసే వారు అరుదు. అందులో శ్రీ రాజారాం గారు ఒకరు. రాజారాం గారు కథ చివర ఓ హెన్రీ వలె చక్కని మలుపు ఇస్తాడు." అని తిరుమల రామచంద్ర గారు అభిప్రాయపడ్డారు. 1

రాజారాం గారు ముగింపులో కథను ఒక ఉన్నత స్థితికి తీసుకుపోయి పాఠకుడు ఒకసారి వెనక్కి తిరిగి చూసుకొనే విధంగా ఆలోచింపజేస్తాడు. అందుకే ముగింపులో కథకు ఒక ఉన్నత స్థితిని ఇచ్చే నేర్పు రాజారాం గారికి వున్నదనే అభిప్రాయాన్ని వెల్లడించారు. డా॥ కొలకలూరి ఇన్నాక్ గారు. 2

రాజారాంగారి తరంగపద్దతి ముగింపు 'సబల' కథలో చూడవచ్చు. కథ పేరు సబల. అందులోని నాయిక విశాల నిజంగా సబల ఆమె వ్యక్తిత్వ చిత్రణ చాలా నేర్పుగా జరిగింది. విశాల తనను పెళ్ళాడే వారిని పరీక్షించ దలచి నదిలో మునిగి పోయినప్పుడు రామారావు రక్షిస్తాడు. చివరికి రామారావు తోనే విశాల పెళ్ళి జరుగుతుంది. అయితే కథాంతంలో విశాలకు ఈత బాగా వచ్చునన్న ఒక్క వాక్యం తటిల్లతలా మెరిసి మాయమవుతుంది.

రాజారాం గారి కథలు చదవడంలో ముగిసినా పఠిత మనస్సులో ముగియకుండా నిలిచి ఆలోచింపజేస్తాయి అనుభూతులను మిగులుస్తాయి.



రాజారాం గారు తమ కథల్లో త్వరిత గతిని పరిణామం చెందే సంఘ ధర్మాల కన్నా ప్రాథమిక మైన శాశ్వత మాననీయ విలువలకు ప్రాధాన్యత నిస్తారు. వెలుపలి మార్పుల కల్లోలంలో మానవత గల్లంతైతే మాత్రం ఆవేదన పడతారు. దాన్ని ఎంతో ఉద్వేగంతో వెలికి తీసి కథ రూపంలో ప్రదర్శించాలని ఆరాట పడతారు.

రాజారాం గారు మధ్యతరగతి కథలు రాస్తారని విమర్శకులు అంటారు. మధ్యతరగతి అంటే కుటుంబ కథలే! కుటుంబ వ్యవస్థ పటిష్టంగా నిలిచి వున్నది మధ్యతరగతిలోనే అన్నది అందరెరిగిన విషయమే! రాజారాం గారి కథలు ఎక్కువగా ఈ కుటుంబం చుట్టే తిరుగుతాయి. ఆటవికయుగాల అనంతరం ఏర్పడిన ఈ వ్యవస్థ కాలక్రమాన పరిస్థితుల ప్రాబల్యం వల్ల అనేక పరిణామాలకు గురవుతూ వచ్చింది మధ్య యుగాలకు ముందు నుంచి ఇది స్వయం సంపూర్ణ గ్రామ వ్యవస్థలో భాగమై తద్విలు వలను సంతరించుకున్నది. కుటుంబంలోని వివిధ వ్యక్తుల మధ్య వుండే సంబంధాలు యుగధర్మాన్ని బట్టి మారుతూ వచ్చాయి.

అయితే సంబంధాల స్వభావం ఎంత మారినా కొన్ని శాశ్వత విలువలు మాత్రం ఇంకా బతికే వున్నాయి 'ప్రేమా' మన్నన' స్నేహం వంటి మానవీయ భావాలు ఊపిరి పీలుస్తూనే ఉన్నాయి.

కానీ ఆధునిక కాలంలోని అనేక త్వరిత పరిణామాల వల్ల ఈ విలువలకు ముప్పువాటిల్లే దుస్థితి ఏర్పడుతున్నది ధనమో వ్యష్టి స్వార్థమో ఈ విలువల వినాశనానికి దారులు వేస్తున్నది ఇటువంటి సంధి దశలోనే రాజారాం గారు కలం పట్టి ఈ విలువలను రక్షించడానికి కంకణం కట్టుకున్న యోధుడిలా కనిపిస్తారు. రామాయణ మహాభారతాల్లోని శాశ్వత విలువల్ని గూడా ఇప్పటి జీవితాల్లో వెతికేంత ఆశావాదంతో రాజారాం గారు పురోగమిస్తారు

శాశ్వత విలువలంటూ అవన్నీ ఒక మహా విలువలో భాగాలుగా రాజారాం గారు గుర్తిస్తారు. ఆ మహావిలువ పేరు మానవత. మానవ శ్రేయస్సు అనేది దాని ప్రయోజనం

రాజారాం గారి మాటల్లోనే .........

ఒరులేయవి యొనరించిన
నరవరయప్రియము తన మనంబునకగదా
నొరులకు నవి చేయకునికి
పరాయణము .................. ఇది ఒక శాశ్వత విలువ.

మంచి చెడ్డలు రెండు కులములు ఎంచి చూడగ లోక మందున అనేది ఒక శాశ్వత విలువ. దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్ అనేది ఒక శాశ్వత విలువ. ఎల్లలోకము లొక్క ఇల్లై జాతిబేధములెల్ల కల్లై అంటూ వసుధైక కుటుంబాన్ని ఊహించడం ఒక శాశ్వత విలువ ఈ విధంగా లోకంలో వున్న మంచి సూక్తులను మంచి తలపులను ఏర్చి ఒక చోట జాబితా కట్టి చెప్పడం కన్నా శతాధిక గ్రంథబావాన్ని ఒకటే మాటలో చెప్పవచ్చు శాశ్వత విలువ ఒక్కటే అది మానవ శ్రేయస్సు. లేదా సమాజ కళ్యాణం కోటినదులు ధనుష్కోటిలో కలిసినట్లుగా అన్ని విలువలు ఈ మహా విలువలో సంగమిస్తున్నాయని ఒప్పుకోక తప్పదు. కాబట్టి ఈ దృక్పథం నుంచి ఒక్కటే శాశ్వత విలువ, ఒక్కటే సార్వకాలికమైన విలువ అది మానవ శ్రేయస్సు ........" 1

అని రాజారాం గారు తమ దృక్పథాన్ని స్పష్టంగా విప్పి చెప్పారు. ఈ దృష్టితో పరిశీలిస్తే రాజారాం గారి కథల్లో భంగం వాటిల్లుతున్నదనే అవేదన కనిపిస్తుంది. మానవుని జీవన క్రమ పద్ధతికి మూలమైన కుటుంబ వ్యవస్థ బీటలు వారుతున్నదనే ఆరాటం గోచరిస్తుంది

సంఘం మారడానికి కారణాలు అనేకం ఉంటాయి కాలం మారుతున్నప్పుడు కొన్ని విలువలు కూడా కాలానుగుణంగా మారక తప్పదు అలా మారడానికి గల కొన్ని కారణాలను గూడా తమ కథావస్తువులుగా స్వీకరించారు రాజారాం గారు. అయితే కుటుంబ వ్యవస్థ పునాదుల్లో వచ్చే ప్రకంపనాలకు చలించి పోవడమే వాటిలో కనిపిస్తుంది

రాజారాం గారి దృక్పథంలో ఈ క్రింది విషయాలను ముఖ్యంగా గమనించాలి.

(అ) కుటుంబ వ్యవస్థ
(ఆ) సంఘ జీవితం
(ఇ) నిజాయితి
(ఈ) వాస్తవికత-ఆదర్శం
(ఉ) సాహిత్య విలువలు
(ఊ) అసమానతల నిరసన

---

1. మంచి కథ మానవ శ్రేయస్సు — మధురాంతకం రాజారాం
అందాల తెలుగు కథ (వ్యాస సంపుటి) — నవభారతి ప్రచురణలు
బర్కత్ పుర, హైదరాబాద్-22

(అ) కుటుంబ వ్యవస్థ :— మానవుడు సంఘజీవి అంటాడు అరిస్టాటిల్ కొన్ని కుటుంబాలు కలిస్తేనే సంఘమవుంది విశాల దృష్టితో పరిశీలిస్తే సంఘమంతా ఒకే కుటుంబమే

కుటుంబ వ్యవస్థ స్థిరంగా వుండాలంటే మౌలికంగా జరుగవలసింది 'పెళ్ళి' పెళ్ళి వల్ల మనుషులకు పరిపూర్ణత సిద్ధిస్తుందని రాజారాం గారి అభిప్రాయం కాని ఉన్నత విద్యల కోసం పట్నవాసలో వుండి అక్కడి కృత్రిమ విలువలకు దాసోహమంటున్న యువతరం అర్థం లేని ఆదర్శాలతో వివాహనికి సుముఖంగా వుండటం లేదు. దీనికి కౌటుంబిక ఆర్థిక, మానసిక, సాంఘిక కారణాలు ఎన్నివున్నా పరిష్కారం మాత్రం పెళ్లి చేసుకోక పోవడం మాత్రం కాదని రాజారాం గారి అభిప్రాయం

ఈ దృష్టితో సాగిన కథల్లో చెక్కుటద్దం-ముకుళిత పద్మం అనే రెండు కథలు స్త్రీల అపరిపక్వ మానసిక అవ్యవస్థకు సంబంధించినవి కాగా చరమాంకం, సిద్ధాక్షరి అనే రెండు కథలు పెళ్లి అనే సంప్రదాయం అనే బంధనాలలో ఇరుక్కుపోవడం అనుకునే పురుషుల అపరిణత అభిప్రాయాలకు సంబంధించినవి 'ఎక్కవలసిన రైలు' ఆదర్శాల లగేజి వలన పెళ్లి కాకుండా మిగిలి పోయిన అభాగ్యుడి కథ. అలా అని ఆదర్శాలు ఉండ కూడదని బాధతల నుండి వైదొలగాలని రచయిత అభిప్రాయం

కాదు పెళ్లి చేసుకొని వ్యష్టి అనదాన్ని చూసుకుంటూనే సమష్టి బాధ్యత నెరవేర్చడమనే కర్మయోగిత్వం రాజారాం గారి కథల్లో కనిపిస్తుంది. దీనికి సాక్షాత్కారం కథ చక్కని ఉదాహరణ.

చెక్కుటద్దం కథలో వాసంతి అనే నర్సు తాను చాలా అందగత్తెనన్న అహభావంతో మగవారిని ఖాతరు చెయ్యక అవివాహితగా మిగిలి పోతుంది. చంద్రమోహన్ సక్కుబాయిల అన్యోన్య దాంపత్యం చూసింతర్వాత పశ్చాత్తాపపడుతుంది. మనిషికి అందమొక్కటే ముఖ్యం కాదని మనస్సు ప్రేమ ముఖ్యమని తెలుస్తుంది. తాను పెళ్లి చేసుకోనందుకు ఎంత విలువైన జీవితాన్ని కోల్పోయిందో తెలుసుకుంటుంది.

"ముకుళిత పద్మం" కథలో గూడా ఇదే సమస్య అయితే ఇందులో నీరజ అనే డాక్టరు తనను ప్రేమించిన వ్యక్తిని ఉన్నత విద్యత మోజులో తిరస్కరిస్తుంది. చివరికి అవివాహితగానే మిగిలిపోతుంది ఆమె జీవితం అసంపూర్ణ గా మిగిలిపోయిందని రచయిత ధ్వనిస్తాడు.

ఆదే విధంగా చరమాంకం కథలో రిటైర్డ్ పోలీసాఫీసర్ సోమశేఖరం గారు మనవలు, మనవరాళ్లు, కొడుకులు, కోడళ్ల మధ్య పండుముత్తైదువయిన అర్ధాంగితో సుఖంగా జీవిస్తూవుంటాడు రాజారాం గారి దృష్టిలో కుటుంబం ఈ విధంగానే వుండాలి జీవిత చరమదశలో మనిషికి కావలసిన ప్రశాంతత తృప్తి కుటుంబంలోనే కదా దొరికేది అనేది ఆయన విశ్వాసం. అందుకే కథ పేరు చరమాంకం

ఇదే కథలో కుటుంబ జీవితానికి పూర్తిగా వ్యతిరేకి అయిన గురుమూర్తి పాత్ర ప్రవేశిస్తుంది గురుమూర్తి సోమశేఖరానికి బాల్య మిత్రుడు. అతడు పెళ్ళనేది ఒక బంధమనీ స్వేచ్ఛ వుండదని భావించి జీవితమంతా జులాయిగా తిరిగి చరమదశలో మిత్రుడయిన సోమశేఖరం ఇంటికి చేరతాడు. మిత్రుని ప్రశాంత జీవితం చూసిన తర్వాత అతనిలో పరివర్తన కలుగుతుంది. తనకు అటువంటి కుటుంబం లేనందుకు బాధపడతాడు తాను మరణిస్తే విచారించేవారు లేరని ఆవేదన పొందుతాడు.

కానీ సోమశేఖరం పరిస్థితి మరొక రకంగా వుంటుంది. బాల్యమిత్రుడు గురుమూర్తి స్వేచ్ఛా విహంగంవలె జీవితాన్ని అనుభవించాడని, తాను మాత్రం ఈ సాంసారిక బంధనాలలో చిక్కుకుపోయినాడని బాధపడుతుంటాడు.

అయితే తెల్లవారేసరికి గురుమూర్తి సోమశేఖరానికి ఒక ఉత్తరం రాసి ఆత్మహత్య చేసుకుంటాడు ఆ ఉత్తరంలో జీవితం అనే గుర్రపు స్వారీకి కళ్లెం బిగించి పట్టడంలోనే ఆనందం వుంటుందని అది లేకపోవడమే నష్టదాయకమని గువ్వకు సహితం పొద్దు పోగనే వెళ్లడానికో గూడుంటుందనీ అటువంటిది తనకు లేదని ఈ దశలో తాను మరణిస్తే తన శవం అనాధ ప్రేతమవుతుందనే ఆవేదన తనను నిరంతరం చిత్రవధ చేస్తున్నదని అందుకే తాను సోమశేఖరం ఇంట్లోని ప్రశాంత వాతావరణంలో ప్రశాంతంగా చనిపోతున్నానని రాస్తాడు.

ఈ కథ వల్ల కుటుంబ వ్యవస్థలో వుండే బంధనాలు శృంఖలాలు కావనే రచయిత ఆంతర్యం తెలుస్తుంది.

"నిశిద్ధాక్షరి" కథ కూడా ఇంతే. హద్దు లేని స్వేచ్ఛ నిశిద్ధాక్షరి వంటిదని, బషీరుద్దీన్ పెళ్లి చేసుకోవడంతో అతనికి బంగారు సంకెళ్ళు బిగించబడ్డాయని తెలుస్తున్నది

పెళ్లయింతరువాత బాధ్యతలను తలకెత్తుకున్నవాడు మానవుల్లో మాధవుడి వంటి వాడనే రచయిత అభిప్రాయం "సాక్షాత్కారం" కథలో వ్యక్తమవుతుంది.

పెళ్లనేది జీవితానికి నిర్వచనం అని చెపుతూనే పెళ్లవగానే భార్య కొంగు పుచ్చుకు తిరగకూడదని, తల్లిదండ్రులను నిర్లక్ష్యం చెయ్యకూడదనే రచయిత అభిప్రాయం "వింత జబ్బు" అనే కథలో చూడవచ్చు. దీని వలన రచయితకు కుటుంబ వ్యవస్థ పట్ల ఎంతటి సకారణ అభిమానముందో తెలుస్తున్నది.

కుటుంబ వ్యవస్థకు ప్రాణం వంటిది ఇల్లాలు. ఇల్లాలు నట్టింట్లో వుంటే అన్ని సిరులు వున్నట్లేనని భావం. రాజారాం గారి కథల్లో వ్యక్తమవుతుంది. "ఉద్యోగం" కథ దీనికి ఉదాహరణ. స్త్రీ ఎంత చదువుకున్నా సాంసారిక జీవితంలోనే ఆమె గౌరవప్రదంగా

జీవిస్తుందనే అభిప్రాయం ఈ కథలో వ్యక్తమయింది. అయితే తప్పనిసరి పరిస్థితులలో స్త్రీ ఉద్యోగం చెయ్యడంలో తప్పు లేదన్న భావం వ్యవస్థ, స్పాట్‌లైట్, దుష్టసమాసం వంటి కథల్లో చూడవచ్చు

కొన్ని పరిస్థితులలో కుటుంబ జీవితంలో వచ్చే ఒడుదుడుకులకు పరిష్కారం వైరాగం కాదనే దృష్టితో వైరాగ్యంతో సరాగం యోగి కథల్లో కనిపిస్తుంది కుటుంబంలో వచ్చే చిన్న చిన్న తుఫానులు కొంత ఓర్పు వహించి ఒకరినొకరు అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తే సర్దుకుంటాయని సర్దుబాటు సహజీవనం కథల ద్వారా చెప్తారు రాజారాం గారు అంతే కాదు కుటుంబంలో యేర్పడే పెద్ద సమస్యలను కూడా సర్దుబాటు చేసుకోక తప్పదు రాజీ పడక తీరదు విడాకులు దానికి పరిష్కారం కాదు అనే ఆవేదన దుష్టసమాసం కథలో చూడవచ్చు.

ఈ కథలన్నింటిలోను రాజారాంగారు కుటుంబ వ్యవస్థలో వున్న విలువలకు ఎంత ప్రాధాన్యత ఇస్తున్నారో అర్థం చేసుకోవచ్చు అయితే కుటుంబ విచ్ఛిత్తికి దారితీసే కారణాలను కూడా రచయిత ఉపేక్షించకపోవడం గమనించాలి

కుటుంబ విచ్ఛిన్నానికి ముఖ్యంగా పారిశ్రామిక విప్లవం, ఉన్నత విద్యలకోసం పట్నవాసం వెళ్ళడం, ఇతర వ్యామోహాలు కారణాలుగా కనిపిస్తాయి. ఇందు వల్ల మానవుల మధ్య తరతరాలనుండి వస్తున్న అనుబంధాలు డబ్బుతో లేదా వ్యక్తి స్వార్థంతో ముడిపెట్టుకొని తెగిపోతున్నాయన్న ఆవేదన రాజారాం గారి కథల్లో కని-పిస్తుంది అయితే కాలం మారుతున్నప్పుడు కొన్ని విలువలు కూడా మారడం అనివార్య-మని, దాని కోసం బాధపడే కంటే సర్దుకుపోవడమే ఉత్తమ మార్గమని "అనివార్యం" కథలో చూడవచ్చు. తరాల అంతరాలమ పై వాళ్లు కూడా అర్థం చేసుకోవాలనే సమ-న్వయ ధోరణి కనిపిస్తుంది.

ఉన్నత విద్యల కోసం పట్నం వెళ్లిన యువతీయువకులు తల్లిదండ్రులను పూర్తిగా మరిచిపోతున్నారు. దానివల్ల కుటుంబ వ్యవస్థ బీటలు వారిపోతున్నదనే ఆవేదన, అనామకుడు, మమకారం, వగపేటికి చల్లచింపినవ్, వికారాలు మమకారాలు సుడిగుండం మొదలైన కథల్లో చూడవచ్చు

ఈ ఐదు కథల్లోనూ పల్లెటూరి నుండి పట్నం వచ్చి తమ అభిజాత్యాన్ని మరిచి పోయిన యువకులే వున్నారు. వీరి విషయంలో రచయిత ఆవేదన స్పష్టమే. అయితే నాణానికి రెండోవైపు వలె అందరూ ఇటువంటి వారు కాదు అనే ఆశాభావంతో మరో కథ కనిపిస్తుంది. అది "తిరస్కృతి".

ఈ కథలో సుందరమ్మత్త అనే పాత్ర పల్లెటూరి నుండి పట్నం వచ్చిన చదువు కున్న యువకులను అల్లుడుగా చేసుకొని వారిని పూర్తిగా తనవైపు మరల్చుటకు ప్రయత్నం చేస్తుంది. ఆమె దృష్టిలో అల్లుడంటే ఫ్రం అడ్రసు లేని పార్శిల్ వంటి

వాడు. అయితే నాగరాజనే యువకుడు ఆమెను తిరస్కరించి ఒక బీద అమ్మాయిని కట్నం లేకుండా పెళ్లి చేసుకుని యువకులకు ఆదర్శంగా నిలుస్తాడు. అందుకే ఈ కథ పేరు "తిరస్కృతి".

యువకుడు ఇదే ఆదర్శాన్ని పాటించాలని రచయిత ఆకాంక్ష ఆధునిక యువకులు - అత్తయ్యలు మొదలైన వారే కాకుండా ఆధునిక యువతులు కూడా కుటుంబ విచ్ఛిన్నానికి కారకులవుతున్నారని చెప్పే కథలు "సుడిగుండం" "సర్వీసు రిజిష్టర్".

"సుడిగుండం" ధనవంతుల అమ్మాయిని పెళ్ళి చేసుకుని తనవారందరికీ దూరంగా బంగారు పంజరంలో బతుకుతున్న చంద్రశేఖరం అనే కథ ఇతడు చివరికి ఆత్మహత్య చేసుకుంటాడు కుటుంబాన్ని విచ్ఛిన్నం చేసే స్త్రీలు తర్వాత తమ కూతుళ్ల గురించి ఆలోచించాల్సి వచ్చినప్పుడు ఆ బాధపడే వారికి అర్థమవుతుందనేది సర్వీసు రిజిష్టర్ కథలో నిరూపితమయింది.

ఈ విధంగా రాజారాం గారు తమ దృక్పథంలో ఆదర్శ కుటుంబం ఏ విధంగా వుండాలి? అది విచ్ఛిన్నమవడానికి కారణాలేమిటి? అనే ఇతివృత్తాలతో సాగిన కథలే కాకుండా కుటుంబవ్యవస్థ పటిష్టంగా వుండడానికి మనుషులు ఎలా ప్రవర్తించాలో కూడా తమ కథల్లో వివరించారు. పురుషులకు ప్రత్యేకం, భాగ్యవిధాతలు, ఎదురుగాలి అనే మూడు కథల్లో కుటుంబ వ్యవస్థలోని లోపాలను ఎత్తిచూపడానికి కూడా వెను-కాడరు రాజారాం గారు.

వరకట్న దురాచారం పైన నిరసన రాజారాంగారి దృక్పథం లో వున్నది అమాయకమైన ఆడపిల్లల జీవితాలతో చెలగాటమాడుతున్న సంప్రదాయాల పట్ల రాజారాం గారి ఆవేదన ఆయన కథల్లో ప్రతిఫలిస్తాయి. ఆడపిల్ల పెళ్ళి కోసం తల్లి పడే ఆరాటం 'కొరకరాని కొయ్య' కథలో సరస్వతి అనే తల్లిపాత్ర ద్వారా వ్యక్తమయింది. భాగ్య విధాతలు కథలో ఆడపిల్లల పెళ్ళిళ్ళ గురించి బాధ పడే మేష్టారు కూడా అదే అభిప్రాయంతో వుంటాడు. వరకట్న దురాచారం సంఘాన్ని పట్టిపీడిస్తున్న వేరు పురుగు వంటిదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తాడు రచయిత

అయితే రాజారాం గారి కథల్లో ఆదర్శవివాహాలు కనిపించక పోవడం గమనార్హం. ఈ కథల్లో సంప్రదాయ వివాహాలకే ప్రాధాన్యత కనిపిస్తుంది. ముఖ్యంగా కమ్మతెమ్మెర కళ్యాణకింకిణి, అక్కయ్య అంతరంగం. దారితోడు వంటి కథలో సాంప్రదాయ వివాహాల సంపూర్ణ వర్ణన చూడవచ్చు. ఈ వివాహ పద్ధతి చాలా మంచిదనే రచయిత అభిప్రాయం పారదర్శకంగా గోచరిస్తుంది అట్లా అని రచయిత ప్రేమ వివాహాలకు వ్యతిరేకి అని నిర్ణయించలేము. 'ప్రియబాంధవి'లో పంకజం 'సబల'లో విశాల, 'ఉద్యోగం'లో కస్తూరి ఈముగ్గురు స్త్రీలు ప్రేమ వివాహాలు చేసుకున్నవారే! ప్రపంచంలో ప్రేమఒక్కటే సత్యమని 'మిథ్య' కథలో నిరూపిస్తారు కూడా రాజారాం గారు

పెళ్ళనేది ఎటువంటిదైనా మనిషికి అది తప్పనిసరి అనే రచయిత అభిప్రాయం స్పష్టమే! అందుకే ఈకథలన్నీ కుటుంబానికి సంబంధించినవి. కుటుంబం సక్రమంగా వుంటే సంఘం సక్రమంగా వుంటుంది సంఘం సక్రమంగా వుంటే దేశం బాగుపడు తుంది ఈ విధమైన విశాల దృక్పథంతో పరిశీలిస్తే విశ్వజనీనమైన మానవ శ్రేయస్సు మౌళికంగా కుటుంబ వ్యవస్థ మీద ఆధారపడి వున్నది అనేది రాజారాం గారి స్పష్ట మైన ఆదర్శం. ఒక్క మాటలో చెప్పవలె నంటే ఆయన మానవతావాది.

(అ) సంఘజీవితం :— మానవుడు సంఘజీవి. సంఘంలో కలిసి జీవిస్తేనే మనిషికి పరిపూర్ణత సిద్ధిస్తుంది. ఈ దృష్టితో సాగిన కథ గ్రూఫ్ ఫోటో. ఈ కథలోని కోదండం వ్యక్తులందరూ స్వార్థపరులనే చింతన కలవాడు. కాని చివరికి సంఘంలో కలిసి పోతాడు. అందుకే సంఘానికి దూరంగా బతుకాలనుకున్నా సంఘం మనల్ని వదిలి పెట్టదు తనవైపు ఆకర్షించు కుంటుంది. ఈ దృష్టితో సాగిన కథ 'నేలా నింగి' తిరుపతి కొండల్లో ఒంటరిగా ప్రశాంత జీవితం గడపాలనుకున్నా సుందరానికి ఒకరాత్రి చిన్న అగ్గి పెట్టె కోసం ఎంతో దూరం రావలసివస్తుంది' అందుకే మానవుడు సంఘ జీవిగానే వుండాలనే రాజారాం గారి అభిప్రాయం.

సంఘాన్ని వ్యతిరేకించి అహంకారంతో బతికితే జీవిత చరమాంకంలో ఒంటరి వాడై పోవలసి వస్తుందనే సత్యం 'దారి తోడు' కథలో కొండలరావు గారి పట్ల నిజమ యింది

సంఘానికి కొన్ని నియమాలుంటాయి ఆ నియమాలను మనకిష్టం లేక పోయినా పాటించాలి తప్పదు. లేకపోతే సంఘం మనల్ని బహిష్కరిస్తుంది అప్పుడు జీవితం నరకమవుతుంది. ఈ దృష్టితో సాగిన కథలు 'సంఘజీవి' అరణ్యరోదనం.

అప్పుడప్పుడు సంఘం నుండి పారిపోవాలని అనిపించినా అనిపించ వచ్చు. అయితే పలాయనం ఒక్కటే పరిష్కారం కాదు? సర్దుకుపోవడమే కర్తవ్యం అన్న రచయిత అభిప్రాయం సంఘజీవి కథలో ఈ విధంగా ప్రతిఫలించింది.

సంఘంలోని వ్యక్తులు మన చేతి కీలు బొమ్మలు కాదు వాళ్ళు స్నేహం చేస్తారు. కలహిస్తారు. అసూయ పడతారు గౌరవిస్తారు. పది మందితో మెలగదలచు కుంటే స్నేహమో, కలహమో, అసూయో, గౌరవమో ఎప్పుడేది ఎదురైతే దానిని స్వీకరించడానికి సిద్ధంగా వుండాలి. అలా కాదనుకుంటే సంఘంలో జీవించడం దుర్లభమవుతుంది

సంఘంలో జీవించడానికి ఇవన్నీ సమకూరినా హోదా. డబ్బూ, పలుకుబడీ అన్నీ ఇంట్లో మనస్ఫూర్తిగా లభించే ఆప్యాయతానురాగాలు దొరకకపోతే మానవుడుసంఘంలో వున్నా అడవిలో వున్నా ఒకటే అన్నభావం పాంథలకథశాలో చూడవచ్చు.

సంఘానికి వుండే మంచి లక్షణాలలో సర్వమత సమానత్వం అనేది శాశ్వత విలువ ఇది 'అద్వైతం' కథ ద్వారా నిరూపితమయింది సంఘం మానవ శ్రేయస్సు కోసం ఏర్పడింది తరతరాల నుండి సంఘంలో ఎన్నో దుష్టశక్తులు ప్రవేశించి ఎంతో అల్ల కల్లోలాలు జరిపినా మళ్లీ వెంటనే నిలదొక్కుకోవడం సంఘ విలక్షణత.

(ఇ) నిజాయితి :— తెగేదాకా లాగకూడదు పట్టువిడుపులు వుండాలి అని భావించే రాజారాం గారు వ్యక్తిలో నిజాయితీ లోపాన్ని మాత్రం క్షమించరు. దేనికైనా త్రికరణ శుద్ధి వుండాలి నమ్మకానికైనా, వృత్తికైనా సూనృత ప్రాణం వంటిది.

లంచగొండితనం అధికారదుర్వినియోగం మొ॥ రాజారాం గారి దృష్టిలో క్షమించరాని నేరాలు. అయితే అటువంటి వ్యక్తులు కూడా రాజారాం గారి కథల్లో తారసపడతారు. వారికి కథలోనే సరైన శిక్ష విధించడం లేదా పశ్చాత్తాప పడేట్టు చేయడం గమనార్హం.

మనం చేస్తున్న వృత్తి మీద మనకు గౌరవం వుండాలి అది ఇతరులకు ఆదర్శప్రాయం కావాలి. ఉపాధ్యాయ వృత్తిలో వున్నవాడికి స్నేహ ధర్మాన్ని సౌహార్దాన్ని త్యాగం చేసేటంత నిజాయితీ వుండాలి అప్పుడే ఆ ఉపాధ్యాయుడు విద్యార్థులకు ఆదర్శప్రాయుడవుతాడు అనే రాజారాం గారి అభిప్రాయం 'అంగరక్షకుడు' కథలో ప్రదర్శించబడినది దళారులకు అధికార దుర్వినియోగానికి ఆలవాలమైన విద్యావ్యవస్థలో ఉపాధ్యాయుడు అవినీతికి ఎదురునిలిచి వృత్తి ధర్మాన్ని నిర్వర్తించాలనే అభిప్రాయం 'అడ్డుదారి' కథలో నిరూపించబడింది

ధనరాయలు అనే వ్యక్తి స్కూలు ఇన్స్పెక్టరుగా పనిచేసి అక్రమ మార్గంలో ధనం సంపాదించి, ప్రభుత్వ దృష్టిలో దోషిలా నిలిచి ఉద్యోగం పోగొట్టుకొని బికారిలాగా వీధిలో పడడం 'మేలు చేసినవాడు' కథలోని ఇతివృత్తం లంచగొండికి కథలోనే సరైన శిక్ష కూడా పడినట్లుగా రాజారాం గారు చూపించారు

నిజాయితీకి మారుపేరయిన వ్యక్తిత్వాలను పరిచయం చేస్తూనే లంచగొండి వ్యక్తుల పతనం సూచిస్తూనే మంచివాళ్ళు, నిజాయితీ పరులు, ఆదర్శవంతులు అన్యాయానికి గురవుతున్నారనే ఆవేదన రాజారాం గారి కథల్లో కనిపిస్తుంది దానికి ఉదాహరణగా "అప్పుల నరసయ్య" కథ కనిపిస్తుంది నరసయ్య నిజాయితీగల వ్యక్తి అతని నిజాయితీని సంఘం అవహేళన చేస్తుంది ఎందరికో అప్పులిచ్చిన నరసయ్య తానిచ్చిన డబ్బు వాపసు తీసుకోడు. కానీ అతనికి అప్పిచ్చిన వాళ్ళు అతన్ని వదిలిపెట్టరు. నరసయ్య దివాలాతీసి ఊరినుండి వెళ్ళిపోతాడు. మరోఊర్లో అగ్గిపెట్టెల వ్యాపారం చేసి క్రమంగా చాలా ధనవంతుడై ఇక్కడికి వచ్చి అందరి అప్పులు నయాపైసలతో సహా ముట్టచెప్పుతాడు. అయినా నరసయ్య నిజాయితీని సంఘం హర్షించదు. తమ డబ్బు గట్టిది కనుక తమను వెతుక్కుంటూ వచ్చిందంటుంది. కానీ నరసయ్య మంచివాడు కాబట్టి తమ డబ్బును తిరిగి ఇచ్చాడని ఒప్పుకోదు.

మనిషికి నిజాయితీ లేక పోతే అతని పాపాలు అతన్నే నశింపజేస్తాయన్న అభిప్రాయం రచయితకు పున్నట్లు కనిపిస్తుంది. ఇతరుల డబ్బును, ఆస్తులను దోచుకుంటే సంతానం కలుగక వంశం నశించి పోతుందనే నమ్మకం 'కాటుక కంటి నీరు' కథలో చూడవచ్చు. ఇతరుల ఆస్తిపాస్తులను దోచుకోవడం అరిష్టం అన్న నమ్మకం హేతు బద్ధమయినా కాకపోయినా అది మంచి నమ్మకం అనే భావాన్ని కలుగ జేస్తాడు రచయిత. అదే విధంగా ఇతరులను నవ్వులపాలు చేద్దామనుకొని తానే ఎందుకూ పనికిరాని వాడుగా తయారయిన రమనాథం కథ 'కార్టూన్' ఈ విధంగా రాజారాం గారు నిజాయితీకి చాలా ప్రాధాన్యత నిస్తారు.

(ఈ) వాస్తవికత-ఆదర్శం :- తెలుగు సాహిత్యంలో వాస్తవికత 'రియలిజం' అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా వాడుం బడుతున్నది "1930 ప్రాంతంలో వచ్చిన ప్రపంచార్థిక సంక్షోభం నుంచి అప్పుడప్పుడే పెరుగుతున్న మార్క్సిస్టు దృక్పథం నుంచి తెలుగు దేశంలో ఫలిస్తున్న రష్యా సామాజిక సాంస్కృతిక కళారంగాల ప్రభావం నుంచి తెలుగు సారస్వతంలో వాస్తవికతా దృక్పథం ఆవిర్భవించిందని" డా. కొలుకలూరి ఇనాక్ గారు వివరించి చెప్పారు. 1

వాస్తవికత అంటే జీవితాన్ని ఉన్నదున్నట్లు చిత్రించడమే ! ఇందులో కల్పనకు అవకాశం లేదు వాస్తవిక దృష్టిపున్న రచయిత సంఘజీవితాన్ని వీలయినంత యధార్థంగా చిత్రించడానికి ప్రయత్నిస్తాడు అందులో రచయిత ఆశయాలు ఆశలు వ్యక్తిత్వం కలగలసినా అవి బాహటంగా కనబడకుండా జాగ్రత్తపడతాడు. సామాజిక సత్యంలో వీలయినంత మట్టుకు లేకుండా చూసుకుంటాడు

"వాస్తవికత తెలుగు కథా సాహిత్యంలో స్వాతంత్ర్యానికి పూర్వం అల్పంగా, అనంతరం అధికంగా గోచరమవుతుంది" అన్న రాజారాంగారి వాస్తవిక దృష్టి సమకాలంలోని సాహిత్యంలో ఎక్కువగా కనిపిస్తుందని అర్థమవుతుంది 2

రాజారాం గారి కథలు ఎటువంటివి? వాటిలో వాస్తవికత ఎంత? అనే ప్రశ్నలకు ఆ కథల్లోనే సమాధానాలు లభిస్తాయి. ఈ కథలు మామూలు దృష్టికి కథలే అయినా వాస్తవసంఘటనల కళారూపాలు. కల్పన ఈ కథల్లో చాలా అరుదు రచయిత కంటికి కనిపించిన వాస్తవ ఆయన హృదయంలో దూరి ఆర్ద్రతను సంతరించుకొని ఒకదృక్కోణంలో కథారూపం పొందుతుంది.

సమాజంలో జరిగే సాధారణ సంఘటనలను జనం పట్టించుకోదు. కానీ అవే సంఘటనలు కళారూపంలో దర్శనమిస్తే బ్రహ్మరథం పడతారు ఈ దృష్టితో సాగిన రాజారాం గారి కథ "జగన్నాటకం."

---

1. **వాస్తవికత తెలుగు కథానిక – డా, కొలుకలూరి ఇనాక్**
   **'మహతి' – యువభారతి**

అయితే వాస్తవంగా కనిపించే సంఘటనలన్నీ సత్యాలు కాకపోవచ్చు. దీనికి "మయసభ" కథ మంచి ఉదాహరణ. ఈ కథలోని సూర్యనారాయణ గారు సత్యాలని భావించిన వన్నీ అవాస్తవాలుగా తేలుతాయి. ఇటువంటి అభిప్రాయం మరో కథలో కూడా కనిపిస్తుంది. అది "రేపటి ప్రపంచం" అనే కథ. పరాంకుశం అనే మేధావిని గురించి విని ఆయనను కలుసుకోవాలనుకొని వెళ్లిన మేష్టారు గారికి పరాంకుశం నిజ జీవితం అతడూహించిన దానికంటే భిన్నంగా ఉండటం చూసి బాధపడతాడు. సంఘంలో ఇటువంటి తల్లులుంటే రేపటి ప్రపంచం ఎలా వుంటుందన్న ప్రశ్న పాఠకుల హృదయంలో కలుగజేస్తాడు రచయిత.

ఆదర్శవాదమయితే చెప్పింది చెయ్యాలి అనే సూత్రాన్ని నిజం చేసిన కథ "బంగారు పాయ్యి" కాని ఆదర్శాలను నమ్ముకుంటే సంఘం అసమర్థుడని ముద్ర వేస్తుంది. అందుకు ఉదాహరణగా "ఎదురు గాలి" కథను చూడవచ్చు.

ఈ విధంగా రాజారాం గారి కథల్లో వాస్తవికత ప్రతిచోటా చూడవచ్చు

## 5. సాహిత్య విలువలు :

సాహిత్యాన్ని గురించి రాజారాం గారికి నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి దానితోపాటు సాహితీ విలువలు దిగజారిపోతున్నాయన్న ఆవేదన కూడా ఈ కథల్లో కూడా చూడవచ్చు. సీరియస్ సాహిత్యం విలువ లేనిదిగా మారిపోతున్నదనీ సాహిత్యం మూడో తరగతి పాఠకుని బలహీనతలను రెచ్చగొట్టేదిగా వుంటున్నదని రాజారాం గారి అభిప్రాయం "ధర్మగ్లాని" కథలో ఈ క్రింది విధంగా వెల్లడయింది.

"సాహిత్య ప్రయోజనం సమాజాన్ని ప్రతిబింబించడం ప్రపంచ శ్రేయస్సును సంధించడం ఈ రెండు విలువలు నేటి సాహిత్యంలో లోపిస్తున్నాయి"

ఇది కథ అనేకంటే వ్యాసం అనడం ఉచితంగా వుంటుంది. ఈ కథ చివరిలో వ్యాసమూర్తి అనే రచయిత రాధాపతికి రాసిన ఉత్తరం లోని ఈ పంక్తులు రాజారాం గారి అంతరంగాన్ని పట్టి చూపుతాయి

"ఫలానా ఊరికి వెళ్లాలనుకున్నప్పుడు కూడలిలో మార్గ నిర్దేశం చేసే రెక్కమాను వాతావరణ మార్పుల వల్ల కూలిపోతే మళ్లీ పైకెత్తి నాటడంలో తిప్పినాటడం జరిగింది అందువల్ల అది చూసుకొని నడిచిన పాంధుడెవరూ గమ్యాన్ని చేరుకోలేడు. అవైపు ఊళ్లు లేవు కొండలూ, లోయలు, కికారణ్యాలు వన్యమృగాలు తప్ప..."

---

2 నేటికథ - వస్తవికత - తెలుగుదనం - మధురాంతకం రాజారాం సమాలోచనం (వ్యాసాలు) ఆం ప్ర. సాహిత్య అకాడమి.

అయితే జనతా ఈ లెక్కమాననే ఎందుకు నమ్మింది? అన్న ప్రశ్నతో కథ ముగిసినా అసలు కథంతా ఇక్కడే ప్రారంభమైనట్లు తోస్తుంది సాహిత్య లోకంలోకి అడుగుపెట్టి ప్రతికొత్త రచయితకు సరైన మార్గ నిర్దేశం లేదని ధ్వనిస్తున్నారు రాజారాం గారు.

ఆధునిక రచయితలు ఎక్కువగా స్వాప్నిక జగత్తును సృష్టించి వాస్తవ పరిస్థితులకు దూరంగా కృత్రిమ విలువలకు ప్రాధాన్యం ఇస్తున్నారని 'చేదు నిజం' అనే కథలో రాధాపతి అనే నాటక రచయిత చేత చెప్పిస్తారు రాజారాం గారు.

తెలుగు కథా రచయితలు తెలుగు వాతావరణాన్ని వదలి ఆకాశయానం చేస్తున్నారని. వారిని భూమి మీదికి తీసుకురావాలని వ్యంగ్య రూపంలో రాసిన కథ 'భూమార్గం.' ఈ వ్యంగ్యం వెనక రాజారాం గారి ఆవేదన స్పష్టమే.

సాహిత్య విలువల గురించి బాధపడుతూనే మంచి సాహిత్య వ్యాసాల వంటి కథలను రాయడం అలవరచుకున్న రాజారాం గారు తమ అనుభవాలనే కథారూపంలో చెప్పుతున్నారని తెలుస్తున్నది. ఒక రచయిత రచనలను క్షుణ్ణంగా చదివి ఆ రచయిత మీద గౌరవాభిమానాలను పెంచుకున్న నిజమైన పాఠకులు ఎదురైతే రచయితకు అంతకు మించిన సంతోషం మరిలేదు. దీనిముందు ఎంతటి సన్మానాలయినా దిగదుడుపే అనే రాజారాం గారి అభిప్రాయం 'సన్మానం' కథలో జరిగిన అనుభవం తెలుపుతుంది ఈ సన్మానం రాజారాం గారికే జరిగివుంటుందన్న ఊహ పాఠకునికి కలుగకపోదు. అది వాస్తవమేమో!

ఏ రంగంలోనైన అభివృద్ధిని సాధించిన ప్రతి పురుషుడి వెనక ఒక స్త్రీ వుంటుం-దనే అభిప్రాయంతో ఒక రచయిత అభివృద్ధి వెనక అతని భార్య వుంటుందని ఆమెకు సన్మానం చేయడం ఔచిత్యమనే రచయిత అభిప్రాయం 'ఘన సన్మానం' కథలో చూడవచ్చు.

సాహిత్య విలువలను గురించి చర్చించే రాజారాం గారి కథలలో ఈనాడు ఎటువంటి కథలు వస్తున్నాయి? సంఘంపై వాటి ప్రభావం ఏమిటి? ఎటువంటి రచనలు రావాలి? మొ॥ విషయాలన్ని చర్చించబడినాయి

## 6. అసమానతల నిరసన :

సంఘంలో జరుగుతున్న అన్యాయాలకు చాలా వరకు అసమానతలే కారణం అవుతున్నాయి. ఇవి ఆర్థిక సామాజిక అసమానతల్లో ఏవయినా కావచ్చు. అణచివేయబడుతున్న వర్గాలు అణచదొక్క బడుతున్న వర్గాలు రెండు సంఘంలో వున్నాయి.

విశ్వమానవ శ్రేయస్సును ఆకాంక్షించే రాజారాం గారు ఈ అసమానతల పట్ల నిరసన ప్రకటిస్తారు

ముఖ్యంగా టీచరుకు అటెండరుకు మధ్యన వుండే బ్యూరోక్రాటిక్ అసమానతలు రచయితకు ఎంతమాత్రం ఇష్టంలేనివి. ఈ దృష్టిలో రాసిందే 'అడిగిరాని వరాలు' కథ, ఈ కథలో రమణయ్య అనే అటెండరు స్కూల్లో టీచర్లందరూ తనను పని మనిషికన్నా హీనంగా చూడడంతో తన కొడుకును చదివించి అదే స్కూల్లో హెడ్ మాస్టరుగా వేయించి కసి తీర్చుకుంటాడు. కానీ రమణయ్య కొడుకు తన తండ్రి తనకు అటెండరుగా వుండడం సహించక తండ్రిని ఉద్యోగంలోంచి మాన్పిస్తాడు.

రూల్సు అనేవి మనిషి కోసం మనిషి సృష్టించినవే కానీ వ్యక్తి శ్రేయస్సుకు ఈ రూల్సు అడ్డువస్తే ఆ రూల్సుకు అర్థం లేనట్లే. ఈ దృక్పథం 'పిచ్చి వెంకటావు' కథల్లో వస్తుంది

ఈ కథల వల్ల రచయిత వ్యక్తి శ్రేయస్సుకు ఎంతటి ప్రాధాన్యత నిస్తారో తెలుస్తున్నది.

స్వభావతః రాజారాం గారు సమాజాన్ని వ్యతిరేక దృష్టి (Negative) తో చూడరు. ఇన్ని లోటుపాట్లలోనే వ్యక్తి విలువలను కాపాడుకోవాలనీ, జీవన సంగీతాన్ని పాడుకోవాలనీ తృప్తిని పిండుకోవాలనీ ఆశిస్తారు.



# అనుబంధాలు-I

## రాజారాం గారి జీవిత రేఖలు :

రాజారాం గారి కథల్లాగానే ఆయన జీవితం కూడా మధురమయిందే! అందుకే ఆయన ఒక రకమైన మధుర కథకులయ్యారు వాలుకుర్చీలో పడుకుని వక్కాకు నములుతూ వచ్చే పోయేవారిని పరామర్శిస్తూ. అతిథి అభ్యాగతుల్ని ఆదరిస్తూ ప్రశాంత మైన జీవితాన్ని గడుపుతున్న రాజారాం గారు పల్లెటూరి అమాయక ప్రజల్లో తాను ఒకడుగా కలిసిపోయి అందులోనే కథావస్తువులను వెతుక్కుంటూ వుంటారు. ప్రజల్లో మెలగడం వల్ల రాజారాం గారు కూడా తమ బోటి వారే అనుకుంటారు కానీ ఆయన సాహిత్యంలో అంతర్జాతీయంగా పేరు పొందారన్న విషయం వారికే కాదు రాజారాం గారికే గుర్తుండదు. 1 అది ఆయన సౌజన్యం.

చూడగానే ఆకట్టుకునే చిరునవ్వు, పొట్టిగా చామన ఛాయతో సరిగంచు ధోవతి తెల్లని చొక్కాపై సరిగంచు ఉత్తరీయం లేదా లాంగీపైన చొక్కా భుజం మీద కండువా వేసుకుని మూర్తీభవించిన సౌజన్యంలాగా కనిపించే రాజారాం గారు తాము చేస్తున్న ఉపాధ్యాయ వృత్తికి నిజమైన ప్రతినిధి వలె కనిపిస్తారు.

రాజారాం గారు 1930 అక్టోబరు 5వ తేదీన చిత్తూరు జిల్లా మొగరాల గ్రామంలో జన్మించారు. విద్యాభ్యాసం చిత్తూరులో సాగింది రాజారాం గారి తండ్రి శ్రీ మధురాంతకం విజయరంగ పిళ్లె గారు. తల్లి శ్రీమతి ఆదిలక్ష్మమ్మ గారు.

రాజారాం గారి తండ్రి తమిళనాడు లోని చెంగల్పట్టు జిల్లా మధురాంతకం తాలూకా నుండి మూడు తరాల పూర్వం చిత్తూరు వచ్చి స్థిరపడ్డారు. ఆయన లోయరు గ్రేడు అన్ ట్రెయిన్డ్ టీచరు ఆయన ప్రోత్సాహంతోనే రాజారాం గారికి అయిదేళ్ల ప్రాయంలోనే సాహితీ జిజ్ఞాస అలవడింది. చిన్ననాటి నుండి నవలలూ, పత్రికలు చదివి తాను కూడా ఎందుకు రాయకూడదు? అని ప్రశ్నించుకుని 20 ఏళ్ల వయస్సులోనే ఒక కథ రాశారు. ఆ తొలికథానిక పేరు 'వీరోచిత వర్తకం.' 1951 మే 30వ తేది ఆంధ్ర పత్రికలో ఈ కథ అచ్చయింది. తరువాత వరుసగా వివిధ పత్రికల్లో రాజారాం గారి కథలు అచ్చు కావడం జరిగింది. 1961 లో పద్మప్రియ ప్రచురణాలయం వారు రాజారాంగారి తొలి కథా సంపుటాన్ని ప్రచురించారు దాని పేరు 'వర్షించిన మేఘం' ఈ సంపుటం రాజారాం గారు తమ నాన్నగారికి అంకితం చేశారు.

---

1. రాజారాం గారి నవల 'చిన్న ప్రపంచం సిరి వాడ' నవల రష్యన్ భాషలోకి అనువదించబడి ప్రగతి ప్రచురణాలయం మాస్కో నుండి ప్రచురించ బడింది.

రాజారాం గారి పూర్వులు తమిళులయినందున వారికి తమిళ భాషంటే అభి-మానం. తమిళం లోని జయకాంతన్ కథలు, అఖిలన్ నవలలు తెలుగులోకి అనువ-దించారు. "వీరసింహుని విజయయాత్ర" వంటి పిల్లల నవలలను అనువదించారు.

జ్ఞానపీఠ బహుమతి పొందిన తమిళ రచయిత అఖిలన్ రాసిన "చిత్తరుప్పావై" నవలను "చిత్రసుందరి" అనే పేరుతో తెలుగులోకి అనువదించారు దానికి తంజా-వూరు తమిళ విశ్వవిద్యాలయం వారు రూ॥ 5,000 అవార్డును ప్రకటించి గౌరవించారు

రాజారాం గారి "తాను వెలిగించిన దీపాలు" కథా సంపుటానికి 1968 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవార్డును ప్రధానం చేసింది

రాజారాం గారు నూతలపాటి గంగాధరం సాహితీ కుటుంబానికి అధ్యక్షులు. ప్రతి సంవత్సరం నూతలపాటి స్మారక సభలు జరుపుతారు

రాజారాం గారి అర్ధాంగి శ్రీమతి నాగభూషణమ్మ గారు. ఆమె సాహిత్యంలోనూ జీవితంలోనూ సహధర్మచారిణి. సాహిత్య విషయాలు ఆవిడతో చర్చించడం రాజారాం గారికి అలవాటు. రాజారాం గారి కథలకు తొలి శ్రోత ఆవిడే! కొన్ని సందేహాలను తీర్చడమే కాకుండా సమయానుకూలంగా సలహాలను కూడా ఇవ్వగలదని 'భూమార్గం' కథ వల్ల ఊహించ వచ్చు. 'ఘన సన్మానం' కథలో రచయితల భార్యలను సన్మానించా లనే సందేశం వెనక నాగభూషణమ్మ గారున్నారేమో! అందుకే కావచ్చు

"మధురాంతకం రాజారాం కథలు" అనే సంపుటాన్ని రాజారాం గారు ఆవిడకే అంకితమిచ్చారు.

రాజారాం గారికి ఇద్దరు కొడుకులు ఒక కూతురు. పెద్దబ్బాయి మధురాంతకం నరేంద్ర తెలుగు యువ కథా రచయితల్లో పేర్కొనదగిన వాడు. రవీంద్రనాథ ఠాకూరు కథల మీద ఎం.ఫిల్ చేసి ప్రస్తుతం శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు లెక్చరర్‌గా పని చేస్తున్నాడు.

రెండవ అబ్బాయి మహేంద్ర. ఎం ఎస్సీ. (ఫిజిక్సు) చేసి శ్రీ వెంకటేశ్వర గ్రామీణ బ్యాంకులో మేనేజరుగా పని చేస్తున్నాడు. మహేంద్ర యువ కథా రచయితల్లో పేర్కొన దగిన వాడు.

అమ్మాయి మంజుల స్పెషల్ తెలుగుతో బి.ఎ. చేసి తర్వాత కర్నూల్లో బి.ఇడి. చేసి ప్రస్తుతం అత్తవారింట్లో కాపురం చేస్తూంది.

స్వస్థలం మొగరాల అయినా ప్రస్తుతం దామల చెరువులో స్థిర నివాసం ఏర్పరచు కున్నారు రాజారాం గారు.

భేషజాలు లేని సాదాసీదా జీవితంతో, సాహిత్యానికీ జీవితానికి అట్టే తేడా లేని సూనృతంతో గడిచే రాజారాం గారి జీవితం నిజానికి ఆయన రాసిన కథలన్నింటి లో ఏదో ఒక రూపంలో ప్రతి ఫలిస్తుంది.

## అనుబంధాలు-II

## రాజారాం గారి కథల పట్టిక :-

| | కథ పేరు | ప్రచురణ వివరాలు | | |
|---|---|---|---|---|
| 1 | వీరోచిత వర్తకం | ఆంధ్ర పత్రిక మే30-1951 | | |
| | | ఇది రాజారాం గారి తొలి కథానిక. రాజారాం గారే ఒక ఇంటర్వ్యూలో (ఆంధ్రప్రభ దిన పత్రిక 3-3-85) తమ తొలి కథ 'వీరోచిత' వర్తకం అని చెప్పారు. కానీ 'అణిముత్యాలు' పత్రికలో తమ తొలి కథ తారుమారు' అన్నారు బహుశ తారుమారు కథనే ముందుగా రాసి వుంటారు. కానీ 'వీరోచిత వర్తకం' ముందుగా అచ్చయింది. ఈ లెక్కన 'తారుమారు' రెండో కథ కావాలి. కానీ అచ్చైన కాలక్రమాన్ని బట్టి చూస్తే 'తారుమారు' నాలుగో కథ అవుతుంది. | | |
| 2 | ఏమరింపులో కొత్తపంథా | ఆంధ్ర వత్రిక | జూలై | 4-1951 |
| 3 | కథ అడ్డం తిరిగింది | ఆంధ్ర పత్రిక | ఆగష్టు | 22-1951 |
| 4 | తారుమారు | ఆంధ్ర పత్రిక | ఆగష్టు | 29-1951 |
| 5 | దంపతులు | ఆ. ధ్ర పత్రిక | డిసెంబర్ | 19-1951 |
| 6 | ముగ్గురు నిర్భాగ్యులు | " | ఫిబ్రవరి | 25-1953 |
| 7 | మా సుందరమ్మక్క | " | మార్చి | 6-1953 |
| 8 | అప్రాప్త మనోహరి | " | జూలై | 29–1953 |
| 9 | ముదితల్ నేర్వగ రాని విద్య | " | ఆగష్టు | 26-1953 |
| 10 | యక్షగానాలు | కిన్నెర (మాస) | ఫిబ్రవరి | 1954 |
| 11 | గోటదీరు పనికి గొడ్డలేల | ఆంధ్ర పత్రిక | పిబ్రవరి | 10-1954 |
| 12 | స్త్రీణాంచచిత్తం పురుషస్య భాగ్యం | " | జనవరి | 19-1955 |
| 13 | చీమలు పెట్టిన పుట్టలు | " | అక్టోబర్ | 12-1955 |
| 14 | ఏకాకి | " | మార్చి | 16-1956 |
| 15 | ఓటమి | " | జూన్ | 20-1956 |

| | | | | |
|---|---|---|---|---|
| 16 | కుంపట్లో కుసుమం | భారతి | జూన్ | 1956 |
| 17 | వనభోజనం | ఆంధ్ర పత్రిక | జూలై | 25-1956 |
| 18 | నిగ్రహానుగ్రహాలు | " | సెప్టెంబరు | 5-1956 |
| 19 | మయసభ | భారతి | అక్టోబరు | 1956 |
| 20 | మనుషులు మమకారాలు | ఆంధ్ర పత్రిక | జనవరి | 2-1957 |
| 21 | కూనలమ్మ కోన | ఆంధ్ర పత్రిక (ఉగాది) | మార్చి | 1957 |
| 22 | అడిగి రాని వరాలు | భారతి | జూన్ | 1957 |
| 23 | సంధ్యా సమస్యలు | ఆంధ్ర పత్రిక | జూలై | 17-1957 |
| 24 | ముక్కుదాడు | " | ఆగష్టు | 14-1957 |
| 25 | వక్ర గతులు | భారతి | ఆగష్టు | 1957 |
| 26 | అడ్డు దారి | ఆంధ్ర పత్రిక | జనవరి | 22-1957 |
| 27 | పంచాంగ ప్రసక్తి | " | మార్చి | 19-1957 |
| 28 | సర్కసు డేరా | " (ఉగాది) | మార్చి | 1958 |
| 29 | సంఘ జీవి | " | జూన్ | 4-1958 |
| 30 | నిజానిజాలు | " | జూన్ | 26-1958 |
| 31 | దుష్ట సమాసం | భారతి | జూన్ | 1958 |
| 32 | వింతజబ్బు | ఆంధ్ర పత్రిక | జులై | 23-1958 |
| 33 | గడన | ఆంధ్ర ప్రభ | ఆగష్టు | 13-1958 |
| 34 | పునర్నవం | ఆంధ్ర పత్రిక (ఉగాది) | మార్చి | 1959 |
| 35 | ఇంటా బయట | ఆంధ్ర ప్రభ | ఎప్రిల్ | 15-1959 |
| 36 | విధి విలాసం | ఆంధ్ర పత్రిక | జూన్ | 10-1959 |
| 37 | వికారాలు - మమకారాలు | " | జూన్ | 25-1959 |
| 38 | మమకారం | జయంతి | ఆగష్టు | 1959 |
| 39 | మానవుడి విజయం | ఆంధ్ర పత్రిక | ఆగష్టు | 5-1959 |
| 40 | మిస్ మరీచిక | " | సెప్టెంబర్ | 9-1959 |
| 41 | సుడిగుండం | జయంతి | ఫిబ్రవరి | 1960 |
| 42 | మాతృ సప్తకం | ఆంధ్ర పత్రిక | మార్చి | 25-1960 |
| 43 | ప్రాణదాత | " | నవంబర్ | 9-1960 |
| 44 | నోరులేని జీవుడు | భారతి | డిసెంబర్ | 1960 |
| 45 | అక్కయ్య అంతరంగం | ఆంధ్ర పత్రిక | జనవరి | 20-1961 |

| | | | | |
|---|---|---|---|---|
| 46 | చరమాంకం | ఆంధ్ర పత్రిక (ఉగాది) | మార్చి | 1961 |
| 47 | వజ్రాదపి | పుస్తక ప్రపంచం | ఏప్రిల్ | 1961 |
| 48 | ప్రియబాంధవి | ఆంధ్ర పత్రిక | మే | 25-1961 |
| 49 | చేదునిజం | " | జూన్ | 28-1961 |
| 50 | వైరాగ్యంతో సరాగం | " | సెప్టెంబర్ | 13-1961 |
| 51 | తాను వెలిగించిన దీపాలు | జవ్వాజి షష్టిపూర్తి అభినందన సంచిక | | 1961 |
| 52 | సబల | ఆంధ్ర పత్రిక | డిసెంబర్ | 29-1961 |
| 53 | వర్షించిన మేఘం | పద్మప్రియ ప్రచురణ | | 1961 |
| 54 | ప్రాప్తి | " | | 1961 |
| 55 | ముగురత్తగార్లు | " | | 1961 |
| 56 | మర్రిచెట్టు | " | | 1961 |
| 57 | జారుడుమెట్లు | భారతి | మే | 1962 |
| 58 | వగపేటికి చల్లచిందినన్ | " | జూన్ | 1962 |
| 59 | బ్రతుకుబాట | ఆంధ్ర పత్రిక | జూలై | 6-1962 |
| 60 | మరీచిక | ఆంధ్రప్రదేశ్ | నవంబర్/ డిసెంబర్ | 1962 |
| 61 | రామారావు చతుర్లోకాలు | జ్యోతి | మార్చి | 1963 |
| 62 | జగన్నాటకం | గోదా ప్రచురణలు | | 1963 |
| 63 | తృప్తి | ఆంధ్ర పత్రిక | | 13-1963 |
| 64 | ప్రజాపతి | భారతి | జూలై | 1964 |
| 65 | తలుపులూ-తాళాలు | జ్యోతి | నవంబర్ | 1964 |
| 66 | దివ్యోషధం | భారతి | డిసెంబర్ | 1964 |
| 67 | ధర్మగ్లాని | భారతి | జనవరి | 1967 |
| 68 | రుచులజాడ వేరు | ఆంధ్రప్రభ | జనవరి | 17-1968 |
| 69 | పట్నం మామయ్య | ఎమెస్కో ప్రచురణలు | ఫిబ్రవరి | 1968 |
| 70 | నూటొక్కటవ తప్పు | ప్రతిభ | ఏప్రిల్ | 12-1968 |
| 71 | హాలికులు కుశలమా | యువ | జూన్ | 1968 |

| | | | | |
|---|---|---|---|---|
| 72 | ట్రంపు చీటి | విశ్వప్రభ ప్రచురణలు | డిసెంబర్ | 1968 |
| 73 | చలిచెలమ | " | " | " |
| 74 | వ్రతభంగం | " | " | " |
| 75 | విధి-విధానం | " | " | " |
| 76 | కన్నెచెర | " | " | " |
| 77 | కళ్యాణ కింకిణి | " | " | " |
| 78 | నిషిద్ధాక్షరి | " | " | " |
| 79 | ఎదురుగాలి | " | " | " |
| 80 | అంగరక్షకుడు | " | " | " |
| 81 | సర్వీసు రిజిస్టర్ | " | " | " |
| 82 | సహజీవనం | " | " | " |
| 83 | రంగయ్యో తమ్ముడు | " | " | " |
| 84 | మెత్తని పులి | " | " | " |
| 85 | బ్రతుక నేర్చిన మనిషి | " | " | " |
| 86 | నమ్మరానివాడు | " | " | " |
| 87 | ఘన సన్మానం | " | " | " |
| 88 | ఖాళీ ఘటా | " | " | " |
| 89 | కార్టూను | " | " | " |
| 90 | మిధ్య | గోవా గ్రంధమాల ప్రచురణలు | మార్చి | 1969 |
| 91 | వ్యవస్థ | " | " | " |
| 92 | వికారాలు మమకారాలు | ఆంధ్రపత్రిక | జూన్ | 25-1969 |
| 93 | నవ్వే పెదవుల వెనుక ఏడ్చే కళ్లు | జయశ్రీ (సంక్రాంతి) | జనవరి | 1970 |
| 94 | మంచివాడికి సన్మానం | పొలికేక | ఫిబ్రవరి | 13-1970 |
| 95 | కమ్మ తెమ్మెర | భారతి | జూలై | 1970 |
| 96 | పురుషులకు ప్రత్యేకం | భారతి | ఆగష్టు | 1970 |
| 97 | అరణ్య రోదనం | ఆంధ్ర పత్రిక | జనవరి | 22-1971 |
| 98 | అనామకుడు | భారతి | ఫిబ్రవరి | 1971 |
| 99 | రాణీసాహెబా రంగయ్యమ్మారావు | యువ | మే | 1971 |

| | | | | |
|---|---|---|---|---|
| 100 | టీ కప్పులో కల్లోలం | ఆంధ్రప్రదేశ్ | జూలై | 1971 |
| 101 | ఆడవాళ్ల అంతరంగం | యువ | సెప్టెంబర్ | 1971 |
| 102 | అప్పుల నరసయ్య | యువ (దీపావళి) | నవంబర్ | 1971 |
| 103 | పాణిగ్రహణం | జ్యోతి | నవంబర్ | 1971 |
| 104 | లెస్ లగేజ్ మోర్ కంఫర్ట్ | ఆంధ్రపత్రిక (ఉగాది) | మార్చి | 1972 |
| 105 | ఈ చీరలో బాగున్నానా? | యువ | జూన్ | 1972 |
| 106 | గాలిపటాలు గాజుదీపాలు | యువ (దీపావళి) | నవంబర్ | 1972 |
| 107 | బంగారుపొయ్యి | ఆంధ్రపత్రిక | జూన్ | 1973 |
| 108 | నేలా నింగి | యువ | సెప్టెంబర్ | 1973 |
| 109 | బెరామీటర్ | యువ (దీపావళి) | నవంబర్ | 1974 |
| 110 | పతిదేవుళ్ళు ఆడ కూతుళ్ళు | యువ (దీపావళి) | నవంబర్ | 1975 |
| 111 | మసి మరక | ఆంధ్రజ్యోతి (దీపావళి) | నవంబర్ | 1975 |
| 112 | ఉగాది తలపులు | ఆంధ్రప్రదేశ్ | ఏప్రిల్ | 1975 |
| 113 | జాగరూకుడు | యువ | సెప్టెంబర్ | 1975 |
| 114 | రేపటి ప్రపంచం | విశ్వప్రభ ప్రచురణలు | | 1975 |
| 115 | సంస్కారం | " | | " |
| 116 | వెలుగు సముద్రంలో చీకటి దీవి | " | | " |
| 117 | కామదహనం | " | | " |
| 118 | పొద్దు చాలని మనిషి | " | | " |
| 119 | కోరినకోనలో కురవనివాన | " | | " |
| 120 | ఒకే కాడ రెండు పువ్వులు | " | | " |
| 121 | ఎక్కవలసిన రైలు | " | | " |
| 122 | సవతి బిడ్డలు | " | | " |
| 123 | స్వస్థానం | " | | " |
| 124 | పుట్టిల్లు | జ్యోతి (దీపావళి) | నవంబర్ | 1976 |
| 125 | పాంథశాల | భారతి | ఏప్రిల్ | 1977 |

| | | | | |
|---|---|---|---|---|
| 126 | గోదారి | జ్యోతి (దీపావళి) | నవంబరు | 1977 |
| 127 | భూమార్గం | ఆంధ్రప్రభ | ” | ” |
| 128 | భాగ్యవిధాతలు | ఆంధ్రప్రభ | డిసెంబరు | 10-1977 |
| 129 | తిరుగు ప్రయాణం | సాహిత్యస్రవంతి ప్రచురణలు | | 1977 |
| 130 | తిరస్కృతి | ” | | ” |
| 131 | గ్రూప్ ఫోటో | ” | | ” |
| 132 | జీవితానికి నిర్వచనం | ఆంధ్రభూమి | ఏప్రిల్ | 6-1978 |
| 133 | అద్వైతం | ఆంధ్రప్రభ | జూలై | 19-1978 |
| 134 | ఉద్యోగం | యువ (దీపావళి) | నవంబరు | 1978 |
| 135 | ఆశయ సిద్ధి | జాగృతి ” | ” | ” |
| 136 | వినోద ప్రదర్శన | సి ఎస్ ఎల్ ప్రచురణలు | | 1978 |
| 137 | రోడ్డు మీద మనిషి | ” | | ” |
| 138 | దాగున్న మూతలు | ” | | ” |
| 139 | త్రిశంకుడి స్వర్గం | ” | | ” |
| 140 | కాటుక కంటి నీరు | ” | | ” |
| 141 | చెక్కుటద్దం | ” | | ” |
| 142 | మూడో వ్యక్తి | జాగృతి | జూలై | 1979 |
| 143 | ఇద్దరు యాత్రికులు | విశాలాంధ్ర ప్రచురణలు | సెప్టెంబరు | 1979 |
| 143 | చిరకాల నిద్రితుడు | ” | | ” |
| 144 | టీ కప్పులో తుఫాను | ” | | ” |
| 145 | లోకపు తీరు | ” | | ” |
| 146 | సమయస్ఫూర్తి | ” | | ” |
| 147 | పరిహారం | నందిని | అక్టోబరు | 10-1980 |
| 148 | ద్వంద్వ సమాసం | ఆంధ్రప్రభ | ఆగష్టు | 19-1981 |
| 149 | అజ్ఞాతవాసం | ఆంధ్రజ్యోతి | నవంబరు | 6-1981 |
| 150 | వానకోటు | జ్యోతి | నవంబరు | 1981 |
| 151 | యోగి | విజయ | జూన్ | 1982 |
| 152 | వ్యాపకం | ఆంధ్రప్రభ | జూన్ | 2-1982 |
| 153 | ఎమర్జెన్సీ | ” | జూలై | 14-1982 |
| 154 | అడవిలో ధర్మదేవత | ” | జనవరి | 26-1983 |
| 155 | రైలు ప్రయాణం | ఆంధ్రపత్రిక | ఫిబ్రవరి | 11-1983 |

| | | | | |
|---|---|---|---|---|
| 156 | ఆశ్రయం | ఆంధ్ర పత్రిక | సెప్టెంబరు | 16.1983 |
| 157 | పుత్రోత్సాహం | ఆంధ్ర జ్యోతి | నవంబర్ | " |
| 158 | అనివార్యం | జ్యోతి | " | " |
| 159 | ఎండమావి | జాగృతి (దీపావళి) | " | " |
| 160 | పిచ్చి వెంకట్రావు | యువ | ఫిబ్రవరి | 1984 |
| 161 | సన్మానం | ఆంధ్ర పత్రిక | ఏప్రిల్ | 13-1984 |
| 162 | దృష్టి భేదం | జాగృతి | నవంబర్ | 1984 |
| 163 | దారితోడు | ఆంధ్ర జ్యోతి | అక్టోబర్ | 1984 |
| 164 | పెనము-పొయ్యి | జ్యోతి | జూలై | 1985 |
| 165 | ఫలితం | ఉదయం | డిసెంబర్ | 30-1984 |
| 166 | శుక్రనీతి | జ్యోతి | జూలై | 1985 |
| 167 | స్పాట్‌లైట్ | యువ | ? | |
| 168 | సాక్షాత్కారం | " | ? | |
| 169 | సంక్రాంతి శంఖం | ఆంధ్రప్రదేశ్ | ? | |
| 170 | శ్రేయస్సు | జ్యోతి | ? | |
| 171 | [illegible] | స్వాతి | ? | |
| 172 | మట్టి గుర్రాలు | ఆంధ్రప్రభ | ? | |
| 173 | మహా నటుడు | యువ | ? | |
| 174 | ముకుళిత పద్మం | ఆంధ్రప్రభ | ? | |
| 175 | అరుదైన అవకాశం | జగతి | ? | |
| 176 | మేలుచేసిన వాడు | జ్యోతి | | |
| 177 | పులిపైన స్వారి | ఆంధ్రభూమి | | |
| 178 | కొరక రాని కొయ్య | ఆంధ్రప్రభ | | |
| 179 | జీవన్ముక్తుడు | యువ (దీపావళి) | | |
| 180 | పెళ్లి సంబరం | ఆనందవాణి | | |
| 181 | స్వాతి వాన | ఆంధ్రప్రభ | | |
| 182 | ప్రయోజకుడు | " | | |
| 183 | జడివాన | " | | |
| 184 | అద్దె కొంప | ? | | |
| 185 | అతిథి | ? | | |

# రాజారాం గారి ఇతర రచనలు

**నవలలు :-**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మరీచిక | ఆంధ్రప్రదేశ్ మాస (సీరియల్) | నవంబర్ | 1962 |
| | | | డిసెంబరు | |
| | | | జనవరి | 1963 |
| 2 | కారణ భూతుడు (నవలిక) | భారతి | డిసెంబరు | 1967 |
| 3 | త్రిశంకుడి స్వర్గం | ఎమెస్కో ప్రచురణ | ఆగస్టు | 1969 |
| 4 | చిన్న ప్రపంచం సిరివాడ | " | అక్టోబరు | 1971 |
| 5 | అవశేషం | విశ్వప్రభ ప్రచురణలు | ? | |

**నాటికలు :-**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | యాత్రానందం | ఆంధ్ర పత్రిక | మే | 1-1957 |

**అనువాద రచనలు :-** (తమిళం నుండి)

| | | | | |
|---|---|---|---|---|
| 1 | వీరసింహుని విజయయాత్ర | విశ్వ ప్రభ ప్రచురణలు | జూలై | 1967 |
| 2 | చిత్ర సుందరి | కమలా పబ్లికేషన్ విజయవాడ | ? | |
| 3 | జయకాంతన్ కథలు | నేషనల్ బుక్ట్రస్ట్ ఆఫ్ ఇండియా | ? | |

**ఇంగ్లీషు నుండి :-**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | గోటదీరు పనికి గొడ్డలేల ? (టాల్ స్టాయ్) | ఆంధ్ర పత్రిక | ఫిబ్రవరి | 10-1954 |

**కవితలు :-**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | హేమంత సంక్రాంతి | ఆంధ్ర పత్రిక | జనవరి | 18-1956 |
| 2 | మా ఊరి యేరు | " | జూన్ | 27-1956 |
| 3 | పాటలతోట (కవితా సంకలనం) | భారతి ప్రచురణలు | జనవరి | 1968 |

**వ్యాసాలు :-**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | తెలుగు సాహిత్యంలో కథానిక | ప్రజామత | నవంబర్ | 21-1954 |

| | | | | |
|---|---|---|---|---|
| 2 | తెలుగు కథానిక | అఖిల భారత తెలుగు రచయితల మహాసభ ప్రత్యేక సంచిక రాజమండ్రి | జనవరి | 1963 |
| 3 | కల్పనా కథలు | కామధేను | నవంబరు | 1-1971 |
| 4 | నేటిపాఠకులకు నచ్చే కథలు | " | మే | 15-1972 |
| 5 | తెలుగు కథ-తెలుగు దనం | యువ భారతి ప్రచురణలు | | 1972 |
| 6 | తెలుగు కథ పాత్ర చిత్రణ | ఆంధ్ర సారస్వత సమితి | | 1974 |
| 7 | తెలుగు కథ వికాసం | " | | " |
| 8 | కథనరంగం | వసుబుక్ లింక్స్-మద్రాసు | | 1975 |
| 9 | పల్లెల్లో ఉన్నది తల్లి భారతి | ఆంధ్రప్రభ | అక్టోబరు | 6-1977 |
| 10 | నేటి కథ వాస్తవికత తెలుగుదనం సమాలోచనం | ఆం.ప్ర. సాహిత్య అకాడమి | జనవరి | 1980 |
| 11 | ఒక దశాబ్ది తెలుగు కథలు (పీఠిక) | ,, | | ,, |
| 12 | మంచి కథ మానవ శ్రేయస్సు | నవభారతి ప్రచురణలు | ఆగష్టు | " |
| 13 | తొలినాటి తెలుగు కథలు (ప్రవేశిక) | ఆం.ప్ర సాహిత్యఅకాడమి | జనవరి | 26-1982 |
| 14 | కరుణ కుమార | ,, | | 1982 |
| 15 | అచ్చయిన నాతొలి పుస్తకం | ఆంధ్ర జ్యోతి | జూన్ | 8-1984 |
| 16 | మన కథలు-దేశీయత-వాస్తవికత | భారతి | ? | |
| 17 | తెలుగు కథ | స్పందన సాహితీ సమితి మచిలీ పట్నం | ? | |

# అనుబంధాలు-III

## ఉపజీవ్య రచనలు :

1 కనకయ్య చామర్తి : "శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి చిన్న కథలు-పరిశీలన" పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1979

2 కోటేశ్వరరావు వి. : "బుచ్చి బాబు కథలు-వ్యక్తిత్వం" పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం ఉస్మానియా విశ్వ విద్యాలయం 1980

3 దక్షిణామూర్తి పోరంకి : "తెలుగు కథానిక-స్వరూప స్వభావాలు" పిహెచ్ డి. సిద్ధాంత వ్యాసం ఉస్మానియా విశ్వ విద్యాలయం 1977

4 దక్షిణామూర్తి పోరంకి : "తెలుగు కథానికా వాఙ్మయం" ప్రపంచ తెలుగు మహా సభల ప్రచురణలు ఆం.ప్ర. సాహిత్య అకాడమి 1975

5 రంగా చారి ఎం. : "తెలుగు కథానిక-బుచ్చిబాబు" ఎం ఫిల్. సిద్ధాంత వ్యాసం ఉస్మానియా విశ్వ విద్యాలయం 1980

6 లక్ష్మీకాంతం పింగళి : "సాహిత్య శిల్ప సమీక్ష" బాలాజీ పబ్లిషర్స్ 81. బజారు వీధి, తిరుపతి 1970

7 వెంకట సుబ్బయ్య గొర్రెపాటి : "అక్షరాభిషేకం" దేశి ప్రచురణలు-విజయవాడ ద్వితీయ ముద్రణ 1963

8 శంకర్రావు గుమ్మా : "మల్లాది రామ కృష్ణ శాస్త్రి కథలు" పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం ఉస్మానియా విశ్వ విద్యాలయం 1977

వ్యాసాలు :-

| | | | |
|---|---|---|---|
| 1 | అమరేంద్ర | : | వగపేటిక... కథా సంపుటానికి పీఠిక<br>సాహిత్య స్రవంతి ప్రచురణ<br>రామమందిరం వీధి, విజయవాడ-2. |
| 2 | ఆరుద్ర | : | 'మల్లాదిరామకృష్ణ శాస్త్రి'<br>మహనీయులు-కలం చిత్రాలు<br>నవభారత్ బుక్ హౌస్<br>ఏలూరు రోడ్డు, విజయవాడ మే 1979 |
| 3 | ఆర్. | : | 'వక్ర గతులు' సమీక్ష<br>ఆంధ్రజ్యోతి మే. 5 - ? |
| 4 | ఆర్.ఎస్. | : | వగ పేటిక (సమీక్ష)<br>ఆంధ్రప్రభ... ? |
| 5 | ఇనాక్ కొలకలూరి | : | 'మధురాంతకం రాజారాం సహితీ వ్యాసంగం'<br>సాహిత్య వ్యాసాలు. సి ఎల్.ఎస్ ప్రచురణలు<br>స్టేషన్ రోడ్డు హైదరాబాదు. |
| 6 | ఇనాక్ కొలకలూరి | : | వాస్తవికత-తెలుగుదనం<br>మహతి - యువ భారతి 1972 |
| 7 | కవన శర్మ | : | 'మధురాంతకం రాజారాం' ఒక పరిచయం<br>(అముద్రిత వ్యాసం) |
| 8 | కృష్ణ మూర్తి శొంఠి | : | కథలు రాయడమెలా?<br>యశోధర ప్రచురణలు-వరంగల్ |
| 9 | కుటుంబరావు కొడవటిగంటి | | 'కమ్మ తెమ్మెర' సమీక్ష<br>ఆంధ్రప్రభ-29 - 10-69 |
| 10 | చంద్ర కాంత్ డి. | : | వక్ర గతులు - సమీక్ష<br>పుస్తక ప్రపంచం ఫిబ్రవరి - 1969 |
| 11 | ? | | మధుర కథారచయిత మధురాంతకం<br>జ్వాల - 26-1-68 |

12 జానకి జాని — కథానిక - స్వరూప స్వభావాలు
అందాల తెలుగు కథ వ్యాస సంపుటి
నవభారతి ప్రచురణలు-హైదరాబాదు 1980

13 పదరాజు - పాలగుమ్మి — చిన్న కథ 'సుజాత' ఆంధ్ర సారస్వత
పరిషత్తు సప్తమ మహాసభ అలంపురం
సంచిక 1952-విజయ వైశాఖ

14 పద్మరాజు పాలగుమ్మి — మాటలు నేర్చిన మధ్య తరగతి
రేపటి ప్రపంచం, సంపుటానికి పీఠిక 1975

15 పాండురంగారావు వాకాటి — తెలుగు కథానిక మనోవిశ్లేషణ
మహతి - యువ భారతి 1972

16 ప్రాతో — తాము వెలిగించిన దీపాలు (సమీక్ష)
పొలికేక 24-7-72

17 బుచ్చిబాబు — నన్ను మార్చిన పుస్తకం
ఆదర్శ గ్రంథ మండలి
విజయవాడ 1965

18 మల్లికార్జునరావు కప్పగంతుల — 'కథ-ఇతివృత్తం సమకాలీన జీవన సమస్యలు'
అందాల తెలుగు కథ. నవభారతి
ప్రచురణలు-బర్కత్‌పుర హైదరాబాదు

19 మహమ్మద్ ఖాసింఖాన్ — కథానికా రచన
ఆంధ్ర సాహిత్య పరిషత్తు
హైదరాబాద్-దక్కను 1944

20 దక్షిణామూర్తి పోరంకి — కథానిక సాహిత్య వ్యాసములు ౧౪
ఆంధ్ర సాహిత్య అకాడమి 1977

21 రంగనాథరావు పన్యాల — తాను వెలిగించిన దీపాలు (సమీక్ష)
ఆంధ్ర జ్యోతి 2-8-68

22 రమాపతిరావు అక్కిరాజు — కథానిక-నవల 'పరిశోధన'
ఆం.ప్ర. సాహిత్య అకాడమి
రజతోత్సవ సంచిక 1983

23 రవీందర్ పిట్టల — కథానికల్లో వాస్తవికత
ప్రసారిక - ఆధునిక సాహిత్య వేదిక 1984

24 రామకృష్ణారావు జి. — వినోద ప్రదర్శనం (సమీక్ష) ?

25 రామచంద్ర తిరుమల — మధ్య తరగతి భాష ?

26 రామారావు మల్లాప్రగడ — "కథానికా శిల్పము - సన్నివేశ కల్పనము - కథా సంవిధానము." అందాల తెలుగు కథ
నవభారతి - బర్కత్‌పురా హైదరాబాదు

27 రామలింగేశ్వరరావు తుమ్మల పల్లి — కథలు రాసిన వాళ్లకు కలిన శిక్షలు
భారతి - జూలై 1966

28 లక్ష్మీకాంతం పింగళి — కథానిక సాహిత్య శిల్ప సమీక్ష
బాలాజీ పబ్లిషర్స్
81 - బజారు వీధి, తిరుపతి 1970

29 విశ్వనాథ రెడ్డి కేతు — కుటుంబరావు సాహిత్యం (మొదటి సంపుటం)
పీఠిక విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజయవాడ

30 వీర్రాజు శీలా — కథానిక - నిర్మాణ శిల్పం
మహతి - యువ భారతి 1972

31 విహారి — తెలుగు కథ శిల్పం
అందాల తెలుగు కథ నవభారతి-
బర్కత్‌పుర హైదరాబాదు.

32 వెంకయ్య దోనేపూడి — కథానికా శిల్ప పరామర్శనము
అందాల తెలుగు కథ (వ్యాసాలు)
నవభారతి బర్కత్‌పుర హైదరాబాదు

33 శివశంకరశాస్త్రి తల్లావఝుల — కథానిక-దాని పరిణామము
సారస్వత వ్యాసములు 4వ సంపుటం
ఆం.ప్ర. సాహిత్య అకాడమి
ద్వితీయ ముద్రణ 1980

| | | |
|---|---|---|
| 34 | శ్రీరామచంద్ర మూర్తి<br>కొండముది | కథావనంలో కమ్మ తెమ్మెర-రాజారాం<br>ఆంధ్రజ్యోతి 25-11-82 |
| 35 | శ్రీరామ మూర్తి కోడూరి | తెలుగు కథా సాహిత్యం పై<br>మార్క్సిజం ప్రభావం<br>భారతి జనవరి 1978 |
| 36 | శ్రీరామమూర్తి కోడూరి | తెలుగు కథ మనోవిశ్లేషణ<br>ఆంధ్రప్రభ సెప్టెంబర్ 9-84 |
| 37 | సంజీవదేవ్ సూర్యదేవర | ప్రస్తావన<br>తాను వెలిగించిన దీపాలు<br>గోదావబ్లికేషన్స్-ముసునూరు<br>కృష్ణా 1963 |
| 38 | సత్యనారాయణ<br>పాలకోడేటి | ఎత్తుగడ ముగింపు<br>అందాల తెలుగు కథ నవభారతి<br>బర్కత్‌పుర హైదరాబాదు |
| 39 | సత్యనారాయణరావు<br>రావూరి | పత్రికలు - కథలు<br>మహతి - యువ భారతి 1972 |
| 40 | సరస్వతీ దేవి ఇల్లిందల | కథా సాహిత్యము<br>సుజాత - ఆంధ్రసారస్వత పరిషత్తు<br>సప్తమ మహాసభ అలంపురం సంచిక<br>1952 విజయ వైశాఖ |
| 41 | హనుమచ్ఛాస్త్రి ఇంద్రగంటి | కథానిక<br>ప్రతిభ సం. 2. ధాతవర్ష ఆగష్టు 1936 |




| | | | |
|---|---|---|---|
| 1. | Cassell's Eneyelopedia of Litrature 1953. I valume Cassell & Company Ltd. London. | : | "Short story" |
| 2. | Dictionary of world Literary Terms George Allen and unwin Ltd. 1955. Ruskin House Museum street London. | : | Theme, Plot, Style, charector Classification Realism. |
| 3. | Edited by Hellen Hull Bornar and Noble Ine New-york - 10-1969. | : | How to write for the slicks. |
| 4. | Middleton murray | : | The problum of style- London Oxford University Press. First Edition 1922 Reprinted in 1916 and 65 |